ప్రేమలతా గ్రంథమాల.

సంపాదకుడు:
తాడేపల్లి పట్టాభిరామారావు.

ప్రథమ కుసుమము

# : రాణీదుర్గ :

లేక

# దుర్గాకుమారి

గ్రంథకర్తలు:

కవిసోదరులు

బుద్ధిరాజు హనుమంతరావు,
చవక్రాజు సూర్యనారాయణరావు.

వెల అ. 8.

బెజవాడ,
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపబడియె.
మొదటి కూర్పు: 1,000 ప్రతులు—1931.

## ప్రధాన రాజపోషకులు.

శ్రీ శ్రీ శ్రీ రాజా సింహాద్రిఅప్పారావు బహద్దరు జమీందారుగారు, కోటపాడుఎస్టేటు, నూజివీడు.

## రాజపోషకులు.

మ. రా. శ్రీ తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు,
బార్-ఎట్-లా, బెజవాడ.

,, కానూరు వీరభద్రేశ్వరరావుగారు, B.A., L,T ,
ఉభయభాషాప్రవీణ, బెజవాడ.

,, ముప్పిడి రామిరెడ్డిగారు, ల్యాండులార్డు,
గణపవరం.

,, తాడేపల్లి రామచంద్రయ్యగారు,
ల్యాండులార్డు, చోప్పరమెట్ల.

,, సుంకర నరసింహంగారు,
తాలూకాబోర్డు వైస్‌ప్రసిడెంటు, నందిగామ.

,, కృష్ణరావు నాయుడుగారు,
రైల్వే పర్మినెంటు వే ఇన్‌స్పెక్టరు, కొండపల్లి.

## పోషకులు.

మ. రా. శ్రీ డాక్టరు అంగర వెంకటసుబ్బారావుగారు, L.M P.
కొండపల్లి.

,, డాక్టరు బుద్ధిరాజు సుబ్బారావుగారు, L. M. P
కంచకచర్ల.

మ. రా. శ్రీ డాక్టరు పోలాప్రగడ రామచంద్రరావుగారు,
L. M. P., యానమలకూడెం.

,, వేంపాటి సీతారామయ్యగారు, కొండపల్లి.

,, దేవళ్రాజు లక్ష్మీపతిరావుగారు, చందాప్రోలు.

,, దేవళ్రాజు సత్యనారాయణరావుగారు,
చందాప్రోలు.

,, దామెర్ల కోటయ్యగారు, నేటివ్ డాక్టరు,
కొండపల్లి.

,, దామెర మాధవరావుగారు, బందరు.

,, దామెర చెల్లారావుగారు, బొబ్బిలి.

,, గుంటక వెంకటరెడ్డిగారు, గణపవరం.

,, శంకర రామచంద్రరావుగారు,
ల్యాండుహోల్డరు, బెజవాడ.

,, ముత్తేవి రామానుజాచార్యులుగారు, బెజవాడ.

,, అయ్యదేవర లక్ష్మీనరసింహాంగారు, నందిగామ.

,, భట్రాజు అశ్వత్థ నారాయణరావుగారు,
ల్యాండుహోల్డరు, తుళ్లూరు.

,, తుర్లపాటి సంగమేశ్వరరావుగారు, B. A.,
దేశముఖ్, దేశపాండ్యా, అడవిరావులపాడు.

,, బి. సోభారాంసింగుగారు, స్టేషన్ మాస్టరు, కొండపల్లి.

# పీఠిక.

ఈ చిన్నినవల 'ప్రేమలతా' గ్రంథమండలియొక్క ప్రథమకుసుమము. 'దీనిని కవిసోదరులు' మృదుమధుర శైలితో రచించిరి. ఈనవల వీరిప్రథమయత్నమైనను చిత్రవిచిత్రరచనలతోను, మృదుమధుర పద జాలములతోను, మనోహరవర్ణనలతోను విలసిల్లుచున్నది. ఇందలి కథావస్తువు స్వల్పమైనను కవిచాతుర్యవిశేషమువలన నవల పెంపుజెంది నానావిధరంగములతోడను, స్వాభావికసంభాషణలతోడను, నవ్యసుందర కథాసంఘట్టనములతోడను, నవరససంభరితమై, నానాలంకారశోభితమై, యొప్పారుచున్నది.

ఇందలి కథ కేవలకల్పితము. రాజపుత్రుల శౌర్యపరాక్రమవిశేషములును, వీరవనితల అద్భుతధైర్యసాహససంరంభములును, విచిత్రభవన నిర్మాణచాతుర్యరహస్యములును వర్ణనాతీతములు. ఉదయాస్తమయాది ప్రకృతివర్ణనలు కథావస్తువులందులీనమై రమణీయసౌందర్యరేఖల నీనుచున్నవి. ప్రణయలేఖల విశేషములు ప్రళయరేఖావిషాదములుగాపరిణమించుట ఇందలి కథావృత్తము. చిరపరిచితమై, అన్యోన్యవిలసితమై నిరంతరరసపరిపూర్ణమైన గాఢానురాగము శిథిలమైనపుడు నవనీతకోమలహృదయయైన అబల ఎట్లు రోషకషాయితాక్షియై పౌరుషజ్ఞానకీర్తులకొరకు స్వాతంత్ర్యసమరసంరంభ యయ్యెనో యీనవల వివరించుచున్నది.

ఈకథకు, రాణీదుర్గ కథానాయకురాలు. ఈవీర వనిత యుద్ధరంగమునజూపు శౌర్యసాహసములును, విచిత్రభవనపరిపాలనయందు గనబరచు బుద్ధివైశద్యమును, కృత్రిమలేఖారహస్యములు వెల్లడి యైనపిదప కానవచ్చు నిష్కళంక ప్రేమానురక్తియు చదువరులమానసంబులను రంజింపజేయుచున్నవి. కాంతాకుమారి రాణీదుర్గయందు మత్సరక్రోధములు వహించి ప్రత్యర్థియై రామ నారాయణసింగులకు బాసటయై నిలిచి రాణీదుర్గను సంహరింపవలయు నని ప్రబల ప్రయత్నము లొనరించినను తుదకు దైవవశమున విఫలమనోరథయయ్యెను.

ఇట్టి నవలను రచించిన కవిసోదరులు ఆంధ్రలోకమునకు వందనీయులు. ఇకముందు వీరు తమమృదుమధుర రచనలతో ఆంధ్రపాఠకప్రపంచమును మెప్పింప గలుగుదురని నాయాశయము.

ఈగ్రంథమండలిని స్థాపించి పోషింప కంకణము గట్టుకొనిన అధ్యక్షులగు మ. రా. శ్రీ ముప్పిడి సుబ్బారెడ్డిగారి భాషాసేవ యెంతయు గొనియాడదగినది. ఇట్లే ఆంధ్రదేశమందలి ధనవంతులును ఈమండలికి తోడ్పడినయెడల అచిరకాలముననే అభివృద్ధికి రాగల దని విన్నవించుచున్నాను.

ఇట్లు,

ఉభయభాషాప్రవీణ, కానూరు వీరభద్రేశ్వరరావు,

బి. ఏ., ఎల్. టి, బెజవాడ.

# సంపాదకీయ భూమిక.

---

'ప్రేమలతా గ్రంథమండలి' యను పేరట చొప్పర మెట్లలో నీగ్రంథమండలిని ఆంధ్రభాషామతల్లి కొకింత సేవ జేయు నుద్దేశ్యముతో నూతనముగా స్థాపించితిమి. మాయందు వాత్సల్య ముంచి మా బాల్యస్నేహితులైన కవిసోదరులు మ॥రా॥శ్రీ॥ బుద్ధిరాజు హనుమంతరావు, దేవళ్రాజు సూర్య నారాయణరావుగార్లు ప్రేమతో "దుర్గా కుమారి" యను చిన్ని నవలను మా గ్రంథమండలియందు ప్రథమపుష్పముగ బ్రకటించుట కిచ్చిరి. అద్దానికి మేము వారి కెంతయు కృతజ్ఞులము.

ఈ నవలను మా చందాదారులు దయతో స్వీకరించి మా కుత్సాహము గూర్పవలెనని ప్రార్థించుచున్నాడను.

ఇప్పటినుండి ప్రతిమూడుమాసముల కొక ప్రేమమయ కుసుమమును మా చందాదారుల కందిచ్చుటకై ప్రయత్నించెదము.

ఇట్లు

టి. పి. రామారావు.

సంపాదకుడు.

---

# ఒక మాట

మే మీా గ్రంథమును ప్రేమలతాగ్రంథమండలివారు ప్రథమ కుసుమముగా నర్పింపుడని కోరినందున వారి కిచ్చితిమి. దీనిని సాదరముగ గైకొని ప్రచురించినందులకు మండలి వారికి మేమెంతయు గృతజ్ఞులము. గ్రంథరచనకు ప్రోత్సహించిన మిత్రులకు వందనములు.

ఇట్లు భాషాసేవకులు,

కవి సోదరులు.



కవిసోదరులు:

1. బుద్ధిరాజు హనుమంతరావు, (కొండపల్లి)
2. దేవల్రాజు సూర్యనారాయణరావు (గణపవరం)



మ. రా. శ్రీ. ముప్పిడి సుబ్బారెడ్డి గారు,
అధ్యక్షులు
ప్రేమలతా గ్రంథమండలి, గణపవరం.

# అర్థ్యక్షు ప్రశంస.



౧

సీ॥ వైరిశుండాలముల్ ♦ భయవిహ్వలతను సిం
    హస్వప్నముగఁ గాంచ ♦ నలరు నెవఁడు
దానకర్ణుని మించు ♦ దాతయే యనఁ నొప్పు
    నిరతాన్న దాతయై ♦ నెగడె నెవఁడు
ఆర్తులఁ బాలింప ♦ నరిబల మడగింప
    విఖ్యాత శూరుఁడై ♦ వెలసె నెవఁడు
దీనమందారమై ♦ జ్ఞాన ప్రసూనమై
    తనరుచుఁ బేరొందు ♦ ధన్యుఁ డెవఁడు

ధరణి మాగ్రింథమండలా ♦ ధ్యక్షుఁ డెవఁడు
సరగ ముప్పిడిరెడ్డి వం♦శమణి యెవఁడు
అట్టిసుగుణు సుబ్బారెడ్డి ♦ నమలయశుని
గృపను బ్రోవుత గోపాల ♦ కృష్ణవిభుఁడు.

౨

సీ॥ శూరులై సంతతో ♦ దారులై పాలింపఁ
    బూనినా రీ యాంధ్ర ♦ భూమియందు

ధీరులై యర్థిమం ♦ దారులై రక్షింప
బూనినా రీ యాంధ్ర ♦ భూమియందు
శీలురై విక్రమ♦సింహులై శోధింప
బూనినా రీ యాంధ్ర ♦ భూమియందు
ధనికులై నిరతాన్న♦దాతలై పోషింప
బూనినా రీ యాంధ్ర ♦ భూమియందు
నలఘు కీర్త్యుజ్జ్వలులు రెడ్డి ♦ కొలమువారు;
వారలందు ముప్పిడిరెడ్డి ♦ వంశజలధి
చంద్రుఁడైన సుబ్బారెడ్డి ♦ సద్గుణఖనిఁ
గృపను బ్రోవుత గోపాల ♦ కృష్ణవిభుఁడు.

3

సీ॥ వేమభూపాలుని ♦ విఖ్యాతమౌ కీర్తి
యెవరింట వెలుగొందె ♦ నింపుమీఱ
కాటయవేముని ♦ కవితాలలామ తా
నెవరింట వికసించె ♦ నింపుమీఱ
విమల మానసయోగి ♦ వేదాంతి వేమన
యెవరింట జనియించె ♦ నింపుమీఱ
ఆంధ్రభాషాసతి ♦ యతిసంభ్రమంబున
నెవరింట నివసించె ♦ నింపుమీఱ

౩

నట్టి రెడ్లకులంబున ♦ నధికకీర్తి
గన్న ముప్పిడిరెడ్డి వం ♦ గడను నందుఁ
బుట్టినట్టి సుబ్బారెడ్డి ♦ భూరియశుని
గృపను బ్రోవుత గోపాల ♦ కృష్ణవిభుఁడు.

౪

సీ॥ సింహాబలుండైన ♦ శ్రీ రామిరెడ్డికి
లలితతపః పుణ్య ♦ ఫలమనంగ
బంధుమిత్రాదుల ♦ బాసటయై నిల్వ
రెడ్డిపేరుల వేల్పు ♦ గిడ్డియనఁగ
సారస్వతంబును ♦ జక్కఁగాఁ బోషింపఁ
బండితావళి నోము ♦ పంటయనఁగ
బీదసాదల నెల్లఁ ♦ బ్రేమతోఁ బాలింపఁ
గలినుద్భవించిన ♦ బలియనంగ
దీనజన సంతతుల కామ ♦ ధేనువనఁగ
విదిత విఖ్యాత శూరుఁడై ♦ వెలసినట్టి
విమలచరితు సుబ్బారెడ్డి ♦ నమలగుణుని
గృపనుబ్రోవుత గోపాల ♦ కృష్ణవిభుఁడు.

౫

క॥ ఇల నోముత శ్రీశుఁడు, మి
క్కిలి సాతసపడుచుఁ బులిని ♦ గిటివలెఁ దునుమం
గల మా సుబ్బారెడ్డిని
నలఘుపరాక్రమధురీణు ♦ ననవరతంబున్.

ఇట్లు,
కవిసోదరులు.



శా॥ బాబో! బెబ్బులిబాధయంచు జనముల్ ప్రార్థించినంతన్ తుపా
కీబా రొక్కటివేయ వ్యాఘ్ర మచటన్ గీపెట్టుచున్ గూలఁగా
సేబాసంచను మిత్రబృందముల యాశీర్వాదముల్గొన్న దోః
ప్రాబల్యాన్వితు విక్రమాఢ్యు మన సుబ్బారెడ్డిఁ గీర్తించెదన్.

—సంపాదకుఁడు.

శ్రీరస్తు.

శ్రీలతోఁ దులఁదూఁగ ♦ శిష్టుల రక్షింప
గ్రాలుచుండెనుగాదె ♦ రామపదము
దానధర్మక్రియా ♦ దక్షుఁ డీతం డను
జనవాక్యమునఁగాదె ♦ చంద్రపదము
సాధులఁ బోషింప ♦ బేదలఁ బాలింపఁ
బ్రబలుచుండెనుగాదె ♦ రాయపదము
నిరతాన్నదాతనై ♦ నెగడుచుండుటచేత
తేజరిల్లెనుగాదె ♦ ధీరపదము

తాడెపలివంశజలధిసు ♦ ధాకరుఁడగు
రామచంద్రరాయునకు; మా ♦ గ్రంథరాజ
మంకితం బిచ్చినార మా ♦ యనఘమతికి;
మాధవుం డేలు మాకృతి ♦ భర్త నెపుడు.

ఇట్లు,
కవి సోదరులు.

శ్రీ

# దుర్గాకుమారి.

"ఓసిదురాత్మురాల ! గృహమొల్లక సర్వసుఖంబులున్నిరా
యాసమునం దొరంగి మిహిరాంశుమరుచ్ఛదనీరనీరస
గ్రాసము దేహధారకముగా గుహలన్ దప మాచరించు న
మ్మౌనిసరణిం స్పృశించి నగ నేమిఫలం బొనఁగూడెఁ జెప్పుమా."

—మనుచరిత్ర.

## ౧వ ప్రకరణము.

### —♦ మిత్రులిద్దరు శయనించిరి ♦—

మాధుర్యమై, మహానందభరితమై, నవరత్నవిలసితమై యొప్పు కేళీకూటములకు నిలయమై, నందనోద్యానవనమును బురుడించు రామచంద్రనగర పరిసరోద్యానవనమునందుఁ గల విశేషము లనంతములు. ఒకచో తీయమకరందములు జాలువారుగాఁ బ్రవహించుచుండు పూఁదెప్పలోఁ దేలియాడు భ్రమరాంగనల వింతసోయగమును, వేరొకచో శుకపికశారికాది పతంగకుల కలకలధ్వనులును, ఇంకొకచో పాళివాసితమైన కోనలోఁ గ్రీడలఁ దేలియాడు చక్రవాకమిథునములును, మరియొకచో రసాలవల్లరులలో నల్లిబిల్లిగా నల్లుకొనిన చలువపందిళ్ళఁ గుప్పలు కుప్పలుగా పడియున్న సువాసనలీను పుష్పాదులును, గలిగి నేత్రపర్వమై యొప్పారుచుండెను.

అందుఁగల మాధవీలతామంటపమున నొక యౌవన పురుషుఁడు తనమిత్రునితోఁ గూడి సుఖాసీనుఁడై, పూలవాసనలతో వీచు పిల్లవాయువుల నాఘ్రాణించుచు ఆలోచనాసాగరమున నీదులాడుచుఁ దనలోఁ దా నిట్లు వితర్కించుకొనఁ దొడంగెను.

"ఆహా! దుర్గాకుమారీ! నీ వెంతటిదానవైనను దగుదువు. 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' అను పెద్దనార్యుని సామెత నీయందు సార్థకమయ్యెకదా! నీ సోయగము, నీ దృష్టి ప్రసారము దిలకించినపుడెల్ల నా యూహాప్రపంచము తలక్రిందులై తారుమారయ్యెడిది. నవరతీమన్మథుల సామ్రాజ్యము దృగ్గోచరమయ్యెడిది. నీపైటవిదలింపు, నీమోవివిరుపు, మాటిమాటికి పిరుఁదులవంకచూడ్కి నిగిడింపు వాత్స్యాయన కామసూత్రముల జ్ఞప్తికి దెచ్చుచున్నయవి. మానినీ! నీవు కలహప్రియురాలవుగాఁ గనుపడుచున్నావు. ప్రణయకోపము నీయందు మూర్తీభవించినట్లున్నది. ప్రళయకాలాగ్ని జ్వాలల దుముకునాఁడైన నీ నారాయణసింగును స్మరింతువుగాక! అనుంగు సఖివై, ఆత్మీయురాలవై, నాబహిఃప్రాణమవై, మనోహారిణివై, నాహృదయమం దధిష్ఠించి విరహతాపానలమున నన్ను మ్రగ్గఁజేసి చల్లని మావినీడలఁ గులుకుచుంటివా? ప్రణయలేఖయందలి భావము నే నెఱుంగఁజాలననుకొంటివా? కానిమ్ము భావిపరిణామ మెట్లుండునో చూతము." ఇట్లనుకొనుచు నారాయణసింగు తనప్రక్కనున్న మిత్రుఁడగు రామసింగుతో నేమియో పల్కుచుండెను.

"మిత్రమా! జగన్నాటకసూత్రధారియగు పరమేశ్వరుని విచిత్రచర్యలకు మేరయే లేదుకదా. ఇంక ముందు ఏమిచేయఁదలఁచుచున్నాఁడో తెలియదు. ఈ పాత్రలచేత నీ మాయానాటక మెందుల కాడించుచున్నాఁడో తెలియదు."

రామసింగు:— తొందరపడకుము. నీబోటి ధీరులు భీరులగు అబలలవలె అధైర్యపడవచ్చునా? కార్యసాధన మాలోచించుము. నీయత్యద్భుతమేధాశక్తిని వినియోగించి, విశేషముల నారయుము. నెమ్మదిమీఁద కార్యము నెరవేరఁగలదు.

నారా:—మిత్రమా! దుర్గ యేమనినది? ఆఁ! పొరబడితిని. దుర్గసంగతి మన కేల? ప్రణయలేఖ నొకటి పంపెగదా? దానిని చదువుము. మరొక్కసారి కర్ణపేయముగ విందము. రామసింగు ప్రణయలేఖను దెరచి యిట్లు చదివెను.

"తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు
నెలమి తారకాగణము లెక్కింపవచ్చు
తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చు
పురుషుమర్మంబు తెలియంగ పొలతి కగునె?
మాలతీలత ముట్టంగ మాకుఁ దగునె?
మధురపానంబు గోరంగ మాకుఁ దగునె?
తీయమకరందమును జిమ్ము ధీరశక్తి
తిమిరమున దిరుగాడు నీ దివ్యశక్తి
ఎందులో లీనమయ్యెనో ఎవరికెరుక
ఎట్టి గొడవలో యేమొ మా కేరి కెరుక

చిటికెలో మాట కింతటి ♦ చేటు వచ్చె
చిత్రభవనమె మీ కింత ♦ చేటు దెచ్చె
'భద్రముగ నుంటి భామ! సౌ♦భాగ్యసీమ'
యంచు బోధించు నీలేఖ ♦ లందుకొంటి
మాటిమాటికి నీపాటఁ ♦ బాడుకొంటి
కాచుకొన్నంటి, నాపేరు ♦ కలహకంఠి.

ఇట్లు,
రాణి దుర్గా."

నారాయణసింగు లేఖను సాంగముగా విని రామసింగును శయనమందిరమునకుఁ దోడ్కొనిపోయెను.

వీరు పరున్న శయనమందిరమునకు వీధినుండిపోవుటకు ద్వార మున్నది. అదికూడ టేకుచెక్కలచే తయారుచేయఁబడి, చోరులకు దుర్మార్గులకు నభేద్యమై యుండెను. ఆద్వారమున కొక గొప్పతలుపుకూడ నుండెను. రామచంద్రనగరముననున్న దివ్యభవనములన్నిఁటికంటె మేటిదై, విశ్వకర్మ కళానైపుణ్యమును కీర్తించుఁజేయుచుండెను. మొట్టమొదట నాగృహమును బ్రవేశింపవలసిన సింహద్వార మొక్కటి కలదు. అయ్యది మిగులసుందర మగు పావురములతోను హంసలతోను చెక్కఁబడి, గట్టితనమున దుర్గద్వారమును మించియుండెను. ఆద్వారమునుండి లోనికిఁ బోనుపోను ఆభవనరాజము వివిధచిత్రవర్ణపరిశోభితమై చూపరులకు నేత్రపర్వమొసఁగుచుండెను. మఱియు నందలి వింత లనంతములు. ఆగృహమంతయు గచ్చుతో రంగురంగులుగా చిత్రింపఁబడియుండెను.

గోడలకన్నిటికి చిత్రవిచిత్రములగు చిత్రపటములు వ్రేలాడఁ గట్టఁబడియుండెను. చుట్టును మిక్కిలి చక్కనిలతలు గలిగి బంగారునీరు పూతపూయఁబడిన సుందరమగు చట్రమున నమర్పఁబడిన యొక ఛాయారూపపట మం దగ్రస్థాన మాక్రమించుకొనియుండెను. అది యొక స్త్రీరత్నముదై యుండెను. ఆపటము దిగువభాగమున "దుర్గాకుమారి"యను స్వర్ణాక్షరములు స్ఫుటముగా ముద్రింపఁబడియుండెను. సుందరవస్తు సమన్వితమైన యావిలాసభవనము ఇంద్రభవనమువలె చూపరులకుఁ దోఁచుచుండెను.

సుమారు రాత్రి పండ్రెండు గంటలైనది. మిత్రులిద్దరు నొకరినొకరు చేతులను బట్టుకొని తప్పటడుగులిడుచు మేడమెట్లెక్కి శయనాగారముం జేరి యందలి పూపాన్పుపైఁ బరుండి మైమఱచి నిద్రించుచుండిరి.

కొన్ని నిముసము లట్లే గడచెను. జగమంతయు స్వేయానిరంకుశాధికారపయోనిధిని ముంచి జగద్రంగమున సాటిలేక వెలయు ప్రశాంత దేవతాక్షోల్లంఘన మొనర్ప వెరచెనో యన నాగదియందు నిశ్శబ్దము వహించియుండెను. గోడకుఁ దగిలించిన గడియారపు 'టిక్' 'టిక్' మను ధ్వని తప్ప వేరుధ్వని వినవచ్చుచుండుట లేదు. దీపకాంతి యుజ్వలితమై యుండెను. గదితలుపు తీయఁబడియుంటచే వరండాలోనివారు లోనికి వచ్చుట కేయంతరాయమును లేకయుండెను.

అపుడు ఆకస్మికముగ తలుపుచాటునుండి యొక దివ్యమంగళవిగ్రహము నవయౌవనలావణ్యముగలిగి చలువ

జేనిలో చిరునవ్వు తాండవించెనా యనునట్లు ముఖబింబము గలిగి అడుగులలో నడుగు లిడుచు ప్రశాంతదేవత కాటంకము కలుగనీయక శయనస్థలముఁ జేరి వారి వక్షఃస్థలమున గల చొక్కాయి జేబులోనికి తనకోమలహస్తమును జొనిపి వెదకుచుఁ గొంతసేపు నిలువఁబడి యేదియో యోచించి వారికి నిద్రాభంగము కలుఁగనీయక తిరిగి హంసనడకలతో నాగది విడిచిపోయెను.

మిత్రులిద్దరు నిద్రాదేవత బాహువల్లికలనుండి వెలువడనే లేదు.



# ౨వ ప్రకరణము.

—♦ రామచంద్రనగరము ♦—

మేవాడురాజ్యమునందుఁగల నగరములో రామచంద్ర నగరము, మన కథాకాలమునాటికి రాజధానిగా నుండెను. ఈ నగరరాజము ఎటుచూచినను షుమారు మూఁడుమైళ్ళ చతురముఁ గలిగియుండెను. ఇది రమ్యమైన పేటలతోడను, సుందరతరప్రాకారముగల యున్నతమగు కోటతోడను వల రారుచుండెను. దివ్యమైన భవనములు, సుందరమైన మహలులు, దర్బారు మందిరములు నందు గలవు. దీని చుట్టును విశాలోద్యానవనములు గలవు. ఈ నగరమునకు నారాయణ సింగు పరిపాలకుఁడుగా నుండెను.

నారాయణసింగు రాణాసంతతిలోనివాఁడు. ఇతఁడు చిన్నదుర్గము నొకదాని నిర్మించుకొని, విక్రమసింహుని దుర్గాధ్యక్షునిగా నియమించెను. తన సైన్యములన్నిఁటికి సత్యసేనుని నధ్యక్షునిగా నియమించెను. వీరిర్వురు బాహుబలపరాక్రమ సంపన్నులు, వీరాధివీరులు, శౌర్యవంతులు. నారాయణ సింగునకు వీ రుభయభుజములవలె నిలిచి యాతనిమాటకు జవదాటకుండిరి.

నారాయణసింగునకు బాల్యమునుండియుఁ బ్రాణతుల్యుఁడగు నొకమిత్రుఁడు గలఁడు. వానిపేరు రామసింగు. రామసింగు రత్నాకుమారి యను వీరవనితను వివాహమాడెను.

రామసింగునకు కాంతాకుమారి యను నొక సోదరి యుండెను. సమీపబంధువగు 'సరళ' యను యువతి వీరింటఁ బెరుగుచుండెను. కాంతాకుమారీసరళల మైత్రి యత్యద్భుతముగా నుండి, గున్నతరువుల నల్లిబిల్లిగ నల్లుకొన్న తీవలవలె నిద్దరు కలిసిమెలసి విహరించుచుండెడివారు.

వీరిభవనమున కెదురుగా నొక దివ్యప్రాసాదము కలదు. అది గగనభాగమును చుంబించుచున్నదో యనునట్లు మహోన్నతముగ నుండెను. ఈ భవనమునందు "రాణా జస్వంత్" అను తొంబదియేండ్ల ప్రాయముగల వృద్ధుఁడొకఁడుండెను. నెఱసిన వెంట్రుకలు, తెల్లనై మెలికలు దిరిగిన గొప్ప మీసములు, ముడతలువడిన మోము, విశాలమైన వక్షస్థలము, వంగిన దేహము గల యీతఁడు చూచువారికి రాజకుటుంబములోనివాఁడనియు, వయసున సింహపరాక్రముఁడుగ నుండియుండు ననియు, యుద్ధనైపుణ్యమున ఖ్యాతి వడసిన "రాణా ప్రతాపసింహ—ఠాకూర దుర్గాదాసుల" కేమాత్రమును దీసిపోకుండెడివాఁడనియుఁ దోఁపకమానదు.

ప్రస్తుత మీతఁడు బీదస్థితిలో నుండెను. ఈతని కిరువదేండ్ల ప్రాయముగలిగి, సర్వాంగసుందరి యనఁదగు పుత్రికారత్న మొకర్తుక గలదు. ఈమెయే "దుర్గాకుమారి." దుర్గాకుమారి వీరవనిత, భాషాప్రవీణ. బాల్యమునందే తనతండ్రిగారియొద్ద నశ్వారోహణము, బాణవిద్య, కత్తిసాము, రాజ్యతంత్రము మొదలగు రాజోచితవిద్యలనన్నియు నేర్చుకొనినది. పైవివరించిన ప్రాసాదమునకును, నారాయణసింగు భవనము

నకును మధ్య నొక విశాలోద్యానవనము గలదు. ఆయు ద్యానవనమునందు దుర్గాకుమారి, నారాయణసింగు, రామ సింగు, కాంతాకుమారి, సరళలు ఎల్లప్పుడు విహారమునకు వచ్చుచుందురు.

వీరందరు బాల్యమునుండి యొకరి నొకరు విడబాయక కలిసి మెలసి తిరుగుచుండెడివారు. వీరిలో దుర్గాకుమారి నారాయణసింగును గాఢముగా ప్రేమించెను.

దుర్గాకుమారికి మేనత్తకుమారుఁ డొకఁడు గలఁడు. వానిపేరు దిలీపసింహుఁడు. ఈతఁ డప్పుడప్పుడు వచ్చి వీరిని జూచిపోవుచుండెడివాఁడు.



# 3 వ ప్రకరణము.

## ప్రేమాంకురము

చంద్రుఁడు కళావిహీనమై, పడమటి కొండలలోనికి దూరుచుండెను. దంపతులు చిరుకౌఁగిలింతలలో తాండవమాడుచుండిరి. కుక్కుటముల "కొక్కొరోకో" యను కేకలు గ్రామమంతట ప్రతిధ్వనించుచుండెను. తారకల మిన్కుమిన్కు మను కాంతి తగ్గిపోవుచుండెను. వాడవాడల పురాంగనలు రంగవల్లికలు దీర్చుటకు సంసిద్ధులగుచుండిరి. రేయంతయు ప్రణయకలహములచే గలిగిననిద్రాభంగమున అలసి సొలసి అప్పుడే నిద్రలో మునిఁగి తేలుచున్న నూతన దంపతులు బాలార్కుని కిరణప్రసారము తమమోములందుఁ బ్రసరింప, నొక్కింత విసుఁగుతో లేచిపోవనట్లు నటించుచుండిరి. బాలురు మట్టలాగులు తొడిగికొని కుంకుమబొట్లు ధరించి మోముపై ముంగురులు వ్రేలాడుచుండ చంకలో పుస్తకములఁ జట్టిపలకల నిరికించుకొని, చట్టాపట్టాలఁ బట్టికొని పాఠశాల కేగుచుండిరి. జేగంటలవలె మెడలోని చిరుగంటలు మ్రోయఁజనుచున్న వృషభరాజంబుల ముల్లుకఱ్ఱలతోఁ బొడుచుచు, నాగేటికఱ్ఱులచే భూమిని దున్నుటకు కృషీవలులు తమతమ పొలములవైపు చూడ్కుల నిగిడించి వడివడిగా నేగుచుండిరి. వర్తకులు తమ యంగడులఁ దెఱచుచుండిరి. పాటకపుజనము పొట్టకూటికై కూలినాలికై పోవు

చుండిరి. స్త్రీలుగృహకృత్యముల నెరవేర్చుకొనుచుండిరి. ఎని మిదిగంటల ప్రొద్దెక్కి యుండవచ్చును.

ఇర్వురు యువకులు మన యుద్యానవనముదెసకుఁ బోవుచుండిరి. వీరివెనుక నొక యువతీలలామయు గజగమన మున కొలఁదిదూరమున వచ్చుచుండెను. ఈమె పదముల సవ్వడి విని ముందునడుచు యువకులు వెనుఁదిరిగి చూచిరి. ఈమె దివ్యమంగళవిగ్రహము గన్పట్టెను. మనయువకులు, "ఎచ్చటకు బోయెదవు?" అని యామెను బ్రశ్నించిరి. ప్రత్యుత్తర మామెనోటనుండి వెలువడలేదు. తుత్రికాల మట్లె ముగ్వురు నిలిచిపోయిరి. ఇర్వురిలో నొకపురుషుఁ డాశ్యామలకోమలకరపల్లవమును స్పృశించి,

పురు—మానినీ! నీయజమానురాలు లిఖించిన ప్రణయలేఖ యెటుల పరిణమించెనో నీకుఁ దెలియునా?

శ్యామల—ఎటుల పరిణమించిన నేమి? ఏమైనను మాకు నష్టములేదు.

అని యీాసడించుచు సకలజగత్సంహారము గావించు ఆదిశక్తియో యన నేత్రములనుండి యగ్నికణములు రాల మారుమాటాడక యచటినుండి ఆమె వెడలిపోయెను. మిత్రులిద్దరు నిశ్చేష్టితులై యెట్టకేలకు మెల్లమెల్లన వనముదాటి పోవుచుండిరి. మలయమారుతము హాయిగా వీచుచుండెను. భయసంభ్రమాశ్చర్యములతో తరుచ్ఛాయనీడలం బడి వారట్లే నడచిపోవుచుండిరి.

వీరిని వెంటాడిన శ్యామల, దుర్గాకుమారికి దాసి. వాయువేగమనోవేగములఁబోయి రామసింగుగృహముంజొచ్చి, వానిధర్మపత్నియగు రత్నాకుమారిం జూచి,

శ్యామ—అక్కా! క్షేమముగ నుంటివా? సంగతు లేమి?

రత్నా—శ్యామా! క్షేమమేగాని నారాయణసింగును నామనోహరుఁడును ఎచ్చటి కేగిరో యింతవఱకు జాడ లేదు. నీ కేమైనఁ దెలియునా ?

శ్యామ—నా కేమియు తెలియదు.

రత్నా—శ్యామా ! నేనును, దుర్గయు, నారాయణసింగును, నామనోహరుఁడును ఒక కంచమున భుజించి యొక మంచమునఁ బరుండెడివారము. మా ప్రేమమయదృష్టులకు సర్వప్రపంచము సుస్వాగత మిచ్చుచుండెడిది. ప్రేమార్ణవ వీచికాడోలికల నుయ్యేలలూగెడివారము. ప్రేమోద్యాన వనములందే విహరించితిమి. ప్రేమపరిపూర్ణుఁ డగు పరాత్పరుని విలాసములనే వీక్షించుచు విలీనుల మగుచుంటిమి. ప్రేమాధిదేవతనే హృదయపీఠస్థ మొనరించి, ప్రేమాసుమ మాలికల నలంకరించుచుండెడివారము. అప్పటియాటలు, ఆనాటి బాల్యచేష్టలు, ఆకాలపు నర్మగర్భోచితవాక్యములు, తలపునకు వచ్చినపుడెల్ల హృదయము కలవరమొందుచుండును. నీరక్షీరముల భాతిమెలంగిన మాలో పాలసంద్రమునందుఁ బుట్టిన హాలాహలమువలె కల్లోలము బయలుదేరినది. బాల్యక్రీడలన్నియు పోయి, కఠినక్రియలలోనికిఁ బరిణా

మించినవి. ప్రాణాపాయములు కూడా కలుగునేమో యను భీతియుఁ బొడముచున్నది. మిత్రులగు రామనారాయణ సింగులకు శరీరములు వేరుగాని ఆత్మయొక్కటే. వారిద్వారి కేమోసములు వాటిల్లకుండుగాక! దుర్గాకుమారి పోకడలు దురవగాహములు. భావను లనంతములు. పరిస్థితులు తారు మారై, ప్రళయకాలాగ్నిజ్వాలలు చెలరేగుట కవకాశ మిచ్చుచున్నవి. దుర్గయు మహిషాసురమర్దనమునకై భూమిపై నవతరించిన ఆదిశక్తియో యన పరిణమించినది. శ్యామా! భావికాలపరిస్థితు లూహించుటకు మనశక్తి చాలదు.

అని కన్నీరు కాల్వలుగట్ట నేడువ నారంభించెను. శ్యామల యొక్కింత యోదార్చుదానివలె మెల్లమెల్లని వాక్కుల నామెను సంతృప్తిపరచి తనదారిని బోయెను. రత్న రత్న కంబళముపై మూర్ఛిల్లెను.

రామనారాయణసింగులు అవ్యక్తమధురస్వనంబుల బాడు చుండు శుకపికారావముల నాలకించుచు, లేమావిగున్నలఁజేరి క్రొంజివుళ్ళ మెక్కుచు "కుహూ కుహూ" యని పాడు గండు గోయిలల గానమాధుర్యంబు చవిజూచుచు, కొలనిపైనుండి వచ్చుమలయమారుతము మేనికి హాయిగా దగుల నుత్సాహ మున పింఛముల విప్పి నాట్యమాడు మయూరములం గనుచు, కొలకులనున్న యెఱ్ఱదామరలు, నల్లకలువలు, పుండరీక ములు మొదలగు పూవులందలి మకరందమును గ్రోలుటకు జుంజు మ్మని పోవు తుమ్మెదదంపతుల ఝుంకారరవముల

వినుచు, కొలనికి పడమటభాగమున బరివేష్టించి ప్రకృతి సౌందర్యమును దిలకించుచుండిరి.

చిలుకలు రొదసేయుచు దాడిమఫలములనుండి గింజలు మెక్కుచు రామ రామ శబ్దములచేత రామసింగును స్మరించుచున్నవా యనునట్లుండెను. సర్వకళాశోభితమై, సర్వాంగ సుందరమై, స్వర్ణలతామంటపములపైఁ బరచిన పచ్చని తివాసీవలె, నెలరాలవేదికపై పచ్చిక మొలచెను. అందందు నమర్పఁబడిన జలయంత్రములు పూలమొక్కలపై నీటి తుంపరల జిమ్ముచుండెను. సురపొన్న కూటాలఁ జుట్టుకొనిన ప్రేంకణపు తీగెలు ప్రేమ మహాత్యమును జాటుచుండెను. ద్రాక్షకోనలమధ్యను బ్రవహించు మకరందపు కాల్వలు, పూఁదెప్పలతో నిండిపోయెను. కప్పురఁపుటనటుల చాటు నుండివచ్చు మధుకరప్రకరమధురధ్వనులు కర్ణపేయ మొనరింప మనవీరులిర్వురు లేచి మెటకో ప్రయాణమై చనుచుండిరి.

అంత దాపుగానుండు చెట్లచాటునుండి "ఢాం" అను శబ్దము వినవచ్చెను. ఆశబ్దమునకు భూనభోంతరాళములు బ్రద్ద లగునా యనునట్లుదోచెను. మిత్రులిద్దరు నిశ్చేష్టితులై తమ ఖడ్గరాజముల నొఱలనుండి పైకి లాగి నలుదిక్కులఁ దమ కనీనికల బ్రసరింపఁజేయుచుఁ జూచుచుండిరి. అంతట పశ్చిమ దిక్కుగా నిరువది ముప్పదిమంది గల యొక యాశ్వికదళము వృక్షలతాదులచాటునం బడి తమతురంగముల వాయువేగమున కన్న మిన్నగాఁ బరువెత్తించుచు వచ్చి మనమిత్రుల నిద్దరఁ జుట్టుముట్టిరి. ఆకస్మికముగా వచ్చిపడిన వైరులఁ జూచి భీతినం

దక వారలపైఁగవిసి తమ యుద్ధకళానైపుణ్యముఁ జూపుచు రోషభీషణాకారులై కాలాంతకునిపగిదిఁ గన్పట్టుచు, తాళఫలంబులవలె నిర్వురి వీరులశిరంబులఁ జక్కాడి వారిహయంబుల నధిరోహించి తక్కుంగలవారిని నొక్కొక్క వ్రేటున నొక్కొక్కనివంతున భూదేవతకు బలియీయఁ దొడంగిరి.

ఇట్లా గుఱ్ఱపురౌతులలోఁ బదిమంది మృత్యుదేవత కాహారమైనంతనే, మిగిలినవారు రోషకషాయితాక్షులై ప్రాణములకుఁ దెగించి యొక్కమారు రామనారాయణసింగులపైఁ బడిరి.

ఇప్పుడు మట్టమధ్యాహ్నము కావచ్చెను. భానుఁడు తన సహస్రతీక్ష్ణకిరణములతో గగనమధ్యంబున సంచరించుచుండెను. కిరణముల వేడిమిచే ఘర్మశరీరులై మిత్రులించుక యాయాసమునకు లోనయ్యు, మిగిలినవారిని గూడ సులభముగఁ గడతేర్చు నుపాయ మారయుచుండిరి. ఇంతలోఁ దరుణవయస్కులగు నిర్వురాగంతుకు లెచ్చటినుండియో తమ గుఱ్ఱములను వాయువేగమున బరుగెత్తించుకొనుచు వచ్చి, యీపురుషసింహములకుఁ దోడుగా నయ్యాశ్వికదళముపైఁ బడి చెండాడ నారంభించిరి. వారిరువురిలో నొక యువకుఁడు పదునెనిమిదేండ్ల ప్రాయముగలవాఁడును, వేరొకఁడు పదునారు వత్సరముల ప్రాయముగలవాఁడును నయియుండిరి. మన మిత్రులిరువు రా నూత్నపురుషసింహులభుజవిక్రమప్రక్రమంబుంగాంచి యాశ్చర్యనిమగ్ను లగుచు, అంతకుమున్ను దోఁచిన శ్రమమునుగూడ మరచి క్రొత్తధైర్యమును బూని

పోరాఁడఁ జొచ్చిరి. ఇట్లా వీరచతుష్టయపు తీవ్రకరవాలఘాతం బుల కోర్వలేక భటులందఱు తహ తహ పడుచుండిరి. ఆ నూతన పురుషులలో పదునెనిమిది సంవత్సరముల ప్రాయము గల యువకుఁడు తన కరవాలమును గిరగిరం దిప్పుచు, చూప రులకు భయంకరుఁడై వైరుల నందర మృత్యువదనగహ్వర మునకుఁ బంపుచుండెను. రోషాతిశయంబున నొకభటుఁడు ఖడ్గపాణియై యాచిన్నవానిపై ఱుఱికినంతనే, యాబాలుఁడు వెనుదీయక, తత్‌క్షణమే వానిని నేలపాలొనరించెను. ఇటుల మిత్రులిద్దరు తమపై కఱుదెంచుచున్న వైరుల నెదుర్కొని ధైర్యముతోఁ బోరాడుచు, వారిని గ్రమక్రమముగా నొక్కొ క్కని భూదేవికి బలియీయ నారంభించిరి. తమపైకి వచ్చు వైరులఁ దునుమాడుచుఁ, దమకుఁదోడై వచ్చిన నూత్న వీరులు ప్రదర్శించు పరాక్రమములఁ గూడ నడుమ నడుమఁ జూచి, రామ నారాయణసింగులు విస్మితులగుచుండిరి. ఇట్లు సంకుల సమరం బొకింతసేపు జరిగినతరి ఎట్టకేల కా నలువురువీరుల శౌర్యానలంబునకుఁ దాళఁజాలక హతశేషులగు భటులు విశేషభీతచిత్తులై తమపిక్కబలంబులఁ జూపుచు నలు వంకలకుఁ బారిపోయిరి.

సాహసమును శౌర్యాతిశయమును జూపిన యానూత్న యువకుల కడకు మన మిత్రవీరులు చని వీ రెవరాయని పరికిం పుచుఁ జూచుచుండిరి. అంతట నారాయణసింగు రామసింగు నచట నాపి, వారి బాహుపరాక్రమ మసామాన్య మని మన స్సున నిశ్చయించి తనయుత్సాహమును బట్టఁజాలక వారిం జేరి,

నారా—అయ్యా! మీ రెవరు? మీకాపురి మే పురము?

నూతనయువకుఁడు—మాది నారాయణపురము.

నారా—నారాయణపురమునమీయుద్యోగము లెవ్వి?

నూతన—ఉద్యోగమున కేమున్నది? శరణాగతుల రక్షించుటయే మాయుద్యోగము.

నారా — ఆహా! మీయిరువురు మా కొనరించిన యుపకృతి నెంతనికొనియాడఁగలను? మీపరాక్రమము వర్ణనాతీతము. మిమ్ముల నే విడువఁజాలకున్నాఁడను. కావున మీ రిరువురు మానగరమునకు వచ్చి మే మొసంగునాతిథ్యమును స్వీకరించి మమ్ముఁ గృతార్థులఁ జేయ వేఁడుచున్నాఁడను.

నూత్న—అయ్యా! మీనిలయ మెయ్యది?

నారా—రామచంద్రనగరము.

నారాయణసింగుని యాకారమంతయు నా చిన్ని బాలుఁడు రెప్పవాల్పక చూడసాగెను. కాని యేకారణము ననో వాని ముఖలక్షణములు వెంటనే యొకతీరున మారి పోవ, నాబాలుఁడు తనలో నేదియో యోచించుచుండెను. నారాయణసింగు తనవైపు తిరిగి చూచినప్పుడా బాలుఁడు మొగమోరచేసికొని, చిరునవ్వు నవ్వుచు మాటలాడ కుండెను. నారాయణసింగు తనసమీపమున నిల్చియుండినప్పుడా తఁడు వెంటనే మిత్రునివెనుకకుఁ బోయి నిలుచుచు వచ్చెను. ఈలక్షణము లన్నియు బాలునిమిత్రుఁడు గనిపెట్టి, బాలుని

జూచి నవ్వుచు తల పంకింపఁజొచ్చెను. కాని యాచిన్న బాలుఁడు వానియందలి భావము గ్రహించి యూరకుండ వలసిన దని కనుసన్నఁజేసెను. ఇట్లా యిర్వురు తమలో నేమేమియో సంజ్ఞలు చేసికొనిరిగాని నారాయణసింగుమాత్రి మించుకేనియుఁ గనిపెట్టఁజాలఁడయ్యె. అప్పుడు బాలుఁడు నారాయణసింగును జూచి 'అయ్యా! మాకు వేళ యైనది. మేము పోవలయును. మీ నగరమున కిప్పుడు రాఁజాలనందుకు క్షమింపవలయును.

నారా—క్షమించుట కేమున్నది! మీరు రాకున్నను మీస్నేహమును గోరెడివాఁడను సుఁడీ.

నూత్న—మేముగూడ మీస్నేహము మమ్మాటికి నభిలషించువారమే కదా!

నారా— అయ్యా! ఈబాలుని బాహుపరాక్రమ మద్వితీయమైనది. బాలుఁడైనను వీనిశౌర్యమునకు మితి లేదు. కావున నే నెల్లప్పుడు జ్ఞప్తియుండుటకై నాయుంగర మీ చిన్నవాని కిచ్చెదను.

అని నారాయణసింగు తన ముద్రటుంగరమును దీసి యాబాలున కిచ్చెను. ఆబాలుఁ డాయుంగరమును గైకొని వేలినిఁదొడిగికొని సిగ్గున తలవంచుకొనెను. నారాయణసింగు వారికి సెలవిచ్చి, తాను తన మిత్రునిఁ గలిసికొని తనదారిని పోయెను.

ఈ బాలుఁడు రామసింగుసోదరి యగు కాంతాకుమారి. రెండవపురుషుఁడు నారాయణసింగునకు మాతృసమాను

రాలగు సరళాదేవి. వీరు దుర్గాకుమారి గావించిన కుతంత్రము నెఱింగి మిత్రపీరులను రక్షింపవలయునని తురంగారూఢులై బయలుదేరి పరమేశ్వరుని దయచే మన మిత్రులకు బాస టమై వైరులందర పారఁద్రోలిరి! వీరిలో కాంతా కుమారి నారాయణసింగును ప్రేమించి యుండెను. సరళాకుమారి యెవరిని ప్రేమించెనో తెలియదు. రామనారాయణసింగులకు వీరు పరిచితలేగాని పురుషవేషములను ధరించియుండుట చేతను అప్పటి యవస్థనుబట్టియు వీరిని గుర్తింపఁజాలక పోయిరి. అంతట నిరువురును దమఖడ్గముల నెప్పటియట్ల యొరలలో నిడికొని గుఱ్ఱముల నెక్కి త్వరితగతినిఁ బోవసాగిరి.

మార్గమధ్యమున సరళాకుమారి కాంతాకుమారిని జూచి చిరునవ్వు నవ్వుచు నేమేమో హాస్యమాడుచు వచ్చు చుండెను. ఆమాటలఁ బాటింపక కాంతాకుమారి తన వ్రేలి యుంగరమును మాటిమాటికిఁ జూచుకొనుచు మందహాసముఁ జేయుచు, రామనారాయణసింగులకన్న నతిత్వరితముగ నగ రిలోనికిఁ బ్రవేశించి గృహాభిముఖులై పోయి గుఱ్ఱములను గట్టివేసి పురుషవేషముల విసర్జించి యథాప్రకారముగా భవ నములోఁ దిరుగాడుచుండిరి.



# ౪వ ప్రకరణము.

## విచిత్రభవనము

సంధ్యారాగము సిందూరవర్ణముఁ దాల్చెను. వృక్షచ్ఛాయ లంతకంత కభివృద్ధినై "పెరుగుట విరుగుట కొఱకే" యను సామెత ననుకరించు చుండెను. నవయువకులు కాసార తీరములనుండు శిలావేదికలపైఁ బరివేష్టించి ధూమపానము చేయుచుండిరి. ధూమము చిన్ని చిన్ని కారుమబ్బులవలె వ్యాపించి వింతసోయగము బుట్టించుచు నేత్రపర్వ మొనరించుచు సంచారముఁ జేయుచుండెను. యువతీమణులు తటాకములనుండి జలముచేఁ బూరింపఁబడిన బిందెల భుజములపై నిడుకొని హంసనడకలతో రాజవీధులగుండఁ బోవుచుండిరి. ప్రపంచసృష్టికి మేమే కారణ భూతుల మని విఱ్ఱవీగుచు లోకమునకుఁ దెల్పుచున్నవా యనఁ దమమెడలలోని గంటలు గణగణమ్రోఁగ వృషభరాజంబులు దలల నాడించుకొనుచు మందయానములతోఁ బచ్చికబయళ్ళనుండి గృహములకేతెంచుచుండెను.

ఒక పురుషుఁడు కాంతాకుమారి దగ్గర కేగుదెంచి "సోదరీ! ఏమి యాలోచించుచుంటివి?" అని ప్రశ్నించెను. అంతట కుమారి యులికిపడెను. తిరిగి చూచి, 'అన్నా! ఏమియును లేదు. ప్రకృతిసౌందర్యమును దిలకించుచుంటిని.'

రామసింగు—సోదరీ! నారాయణసిం గేదిన మిచ్చుటకు రాఁడు. కావున నీవును సరళాకుమారియు మీ శయనాగార మున పరుండుఁడు. మీ కేమియు భయము లేదు.

అని మెల్లగా నుడివెను. కాంతాకుమారి అన్నగారి చెవిలో నేదియో రహస్యము చెప్పి శయనమందిరమున కేగెను. రామసింగు బయలుదేరి యుద్యానవనమునకుఁ బోయెను. అచ్చట నొక సుందరపురుషుఁడు లతామంటపమున నాసీనుఁడై యేమియో యాలోచించుచుండెను. "మిత్రమా! నీ కొఱకు వెదకుచుంటిని. నరసింహస్వామియాలయమున కేగి మునితో మాట్లాడివచ్చితిని. అతిరహస్యము. నావెనువెంట బయలుదేరుము." అని రామసింగు అనెను. అంతట నారాయణసింగు చెవిలో నేమేమియో రహస్యములు చెప్పి యిద్దరును కలిసి భవనములోని కేగి మిత్రులిద్దరును, యుద్ధపుటుడుపుల ధరించి కరవాలముల నొరలలో నమర్చి నడుమున వ్రేలాడవేసి, బయలుదేరి, వాకిటికడకు వచ్చి యట నిలువబడి నలుదిక్కులఁ జూచుచుండిరి. అంత నొకమూలగా రాజన్యవంశంబులనెల్ల నిర్మూలన మొనర్చి, ప్రతిజ్ఞాపరిపాలన మొనరించి విశ్రాంతిఁగొనుటకు సన్న్యసించిన మహాధనుర్ధరుఁడగు పరశురాముఁడా యేమి యననొప్పు నొక మునిపుంగవుఁడు ఆపాదమస్తకము కాషాయవస్త్రముల ధరించి కరమున దండము నలంకరించి, ఱుకుపావుకోళ్ళు "టక్‌టక్" మని ధ్వనిచేయుచుండ, వృక్షలతాదుల సాటునుండి శీఘ్రగమనమున మిత్రవీరులకడకు విచ్చేసి "ఏమి యింకను నాలస్యము?" అని

ప్రశ్నించెను. "మా యాలస్యమేమియు లేదు. మీకొఱకే నిరీక్షించుచుంటిమి." అని రామసింగు బదులు చెప్పెను. అంతట ముువ్వురు బయలుదేరి యుద్యానవనమునకు దాపుగా నుండు చెట్ల చాటునకుంబోయి యటనుండి యదృశ్యులైరి. రామచంద్రనగరమునకు దక్షిణదిశగా నొక నిబిడారణ్యము గలదు. అది నానాజాతివృక్షములతోడను, మిక్కిలి దట్టమైన పొదలతోడను, ఎలుగు పంది పులి మొదలగు క్రూర మృగములతోడను, లేడి దుప్పి మొదలగు సాధుమృగముల తోడను నిండి దట్టమై పాంథులకెల్ల మిక్కిలిభయంకరముగఁ గన్పట్టుచుండెను. సూర్యాస్తమయమైన తర్వాత నా యరణ్యమున నెవ్వరును మసలరు. ఒకవేళ పోవలసివచ్చిన నొంటిగ పోక జట్టుగా కలిసిపోయెదరు. తెలియక యెవ్వఁడేని నొక వేళ నొంటరిగఁబోయినచో వాఁడేక్రూరమృగమువాతనో పడకతప్పదు. ఆ యడవినడుమ తేటనీరుగల చక్కనికాసార మొండు గలదు. దానినిండ కలువ తామర నాచు మొదలగు నవి దట్టముగ నున్నవి. దానిమీఁద నీటిచలములు, బాతులు చేపల కొఱకై వేటాడుచున్నవి. దానికి నలుగడల పొడవైన వృక్షములును, వానిప్రక్క పొదలును దట్టముగానుంటచే వేల కొలఁదిశకుంతసంతానములకు నివాసయోగ్యమైయుండెను. ఆ తటాకమున కుత్తరముగా, భూమికి మట్టముగా నొకనగిషీ చేసినయిత్తడిబందులు బిగించిన నల్లమద్దితలుపు బహుయుక్తి యుక్తముగా నమర్పఁబడియుండెను. ముువ్వురుపురుషులు చెట్ల చాటుననుండి తొందరతొందరగా తటాకముదరి కేగుఁదెంచి

ఆతలుపుకడ నాసీనులై యాద్వారము వివృతముగావింప నప్పుడు ప్రయత్నించుచుండిరి. అది రహస్యభవనమువలెఁ దోఁచుచున్నది. తలుపు జాగ్రత్తగా బిగించియుండుటచే లోనికిఁబోవుటకు వీలుకన్పట్టుట లేదు. అక్కడ కూర్చుండి యున్న పరిచితపురుషులు లోపలినుండి వచ్చుమాటలు వినవలెనని కుతూహలము తోనుండియున్నందున వారిప్రయత్నమునుండి విరమింపక తమబలమంతయు నుపయోగించి యా ద్వారము తెరవగలిగిరి. అట్లు తెరచి యా సురంగము గుండ లోనఁ బ్రవేశించి యందలిమార్గమున పాతాళగృహము నొద్దకుఁ బోయిరి. అచ్చట మాటలసవ్వడి వినఁబడుటచే నందే నిలువఁబడి యా మాటల వినసాగిరి. ఆ గది అంధకారబంధురమగుటచే వీ రెవ్వరికిని గాన్పింపకుండిరి.

స్త్రీ—ఏమిరా విశేషములు?

పు—అమ్మా! మధ్యాహ్నము మీారు పంపిన సైనికులు పగలు భవనముఁజొచ్చిన శత్రువులు కనుగొనెదరను భయముతో నిపుడే భవనముఁ బ్రవేశించి ద్వారములను గట్టిగా మూసివచ్చినారు. తమ సెలవయినఁ దోడ్కొని వచ్చెదను.

స్త్రీ—సత్వరంబుగాఁ బ్రవేశపెట్టుము.

పు—అమ్మా! ఇదిగో వీరే వారు.

స్త్రీ—సైనికులారా! నారాయణసింగును బంధించితిరా?

పు—అమ్మా! జరిగిన కథ వినుము. మేము ఒక్కమారు మిత్రవీరులపైఁ బడినంతనే వారు విజృంభించి యుద్ధ

సైనికులలో నిద్దరను జంపి వీ రధిరోహించిన హయంబుల వారలు గైకొని కడమవారిపైఁ బడిరి. అంతట నెచ్చటినుండి యో వీరికిఁదోడు వీరులగు నిర్వురు యువకులు తురంగారూఢులై వచ్చి అందర సంహరించి మమ్ములఁగూడఁ బ్రాణావశిష్టులఁ జేసిరి. కాని యెట్టులో మేము మీా కీసమాచార మెఱిఁగించుటకు రాగలిగితిమి.

స్త్రీ—మీారు నారాయణసింగును బట్టి బంధించి నా కడకు రండు. లేనియెడల మిమ్ముల నాఖడ్గరాజమునకు బలి యిచ్చెదను! సత్వరంబుగ పొండు. నారాయణసింగును బంధించుదనుక మీా మొగంబుల నాకుఁ జూపకుఁడు.

పు—అమ్మా! సైనికులతో వెళ్ళినవాఁడింకొకఁడు వచ్చినాఁడు.

స్త్రీ—ఇటుల దీసికొనిరమ్ము.

పు—అమ్మా! యిదిగో వచ్చినాఁడు.

స్త్రీ—ఏమిరా! సంగతు లేమో తెల్పుము.

పు—అమ్మా! రామనారాయణసింగులకుఁ దోడ్పడిన వీరులు లక్ష్మణసింగు, కృష్ణసింగు లని తెలిసి నేను వారివెంట ప్రచ్ఛన్నముగ భవనమున కేగితిని. వారలలో లక్ష్మణసింగు కాంతాకుమారిగాను, కృష్ణసింగు సరళాకుమారిగాను మారి పోయిరి. ఈ విచిత్రము తమకు విశదపరుచుటకు వచ్చితిని. సెల వొసంగెదరా.

స్త్రీ—నీవు వెళ్ళి గృహద్వారములన్నియు మూసియున్నవో లేవో చూచుచు జాగ్రత్తగా గస్తీ తిరుగుచుండుము.

నౌకరు—చిత్తము.

స్త్రీ—భీమసింగూ! భీమసింగూ!!

భీమ—అమ్మా! ఏమి సెలవు?

స్త్రీ—నీవు వెళ్ళి పరియాణమునకు అశ్వమును సిద్ధపరుపుము.

భీమ—చిత్తము. అమ్మా! అంతయు సిద్ధము. బయలు దేరవచ్చును.

స్త్రీ—పురుషులు ధరించు యుద్ధపుటుడుపులఁ దీసికొనిరమ్ము.

భీమ—'చిత్తము' అని తెచ్చియిచ్చినతోడనే యాస్త్రీ గుఱ్ఱముపై నెక్కి యెచ్చటికో పోయెను.

ఈమాటలు విన్నముగ్గురుపురుషులు చివాలున లేచి మొదలువచ్చిన మార్గముననే కాసారతీరముం జేరి ఆచెట్ల చాటునంబడి యెచ్చటికో పోయిరి. పాఠకమహాశయులారా! పైవర్ణింపఁబడినభవన మతిసుందరమై యొకవిశాలారణ్యమధ్యమున కట్టఁబడినది. దీనియందుఁ బరుపఁబడినవన్నియు చలువశిలలే. దీనిచుట్టు శత్రువీరుల కభేద్యమై చూపరులకు భయమును గొల్పు దృఢమైన ప్రాకారము కొండశిలలచే నిర్మింపఁబడినది. దీనిచుట్టు కందకముగలదు. కందక మెల్లప్పుడు కొండలలో నుండివచ్చు యేటిప్రవాహముచే నింపఁబడుచుండెను. నలుదిశల నాల్గుద్వారము లమర్పఁబడెను. ప్రతిద్వారము బాధించుటకు యినుపతలుపు లమర్పఁబడియుండెను. భవ

నమునందుఁగలచిత్రములు వర్ణనాతీతములు. అందు సోఫాలు, కుర్చీలు, మేజాబల్లలు, నిలువుటద్దములుగల గదులు ప్రత్యేకముగాఁ గట్టఁబడెను. వానియం దెల్లప్పుడు ఆహారపదార్థములతోను పరిపక్వఫలములతోను, పలురకములమధురరసపానీయములతోను నింపఁబడిన రజితపాత్రలు బల్లలపై నుంచఁబడును. శత్రువీరుల దండించు ఆయుధోపకరణ ములుగలఆయుధాగారములు వేరొకచో వరుసగాఁ గట్టఁబడెను. శృంగారకళాశోభితమై ప్రపంచమందుఁగల వీరాధివీరులగు పురుషులయొక్కయు వనితలయొక్కయు ఛాయాపటములు దర్బారుహాలులో వ్రేలాడఁ గట్టఁబడెను. దర్బారుహాలు దాటి శయనమందిరద్వారముగుండా లోనికిఁ బోయినకొలఁది యినుపతలుపు లమర్చఁబడిన శృంగారమందిర మొండు గన్పట్టును. మందిరప్రాంగణమునందుఁ బరుపఁబడిన ఱేకు కూర్పు వరుసగాఁ బరుపఁబడియుండును. ఆకూర్పునందు అత్యద్భుతయంత్ర మమర్పఁబడియుండెను. ఆయంత్రముపై నెవరి పాదము బడునో వాఁ డధోభాగమునకుఁ బోవలసినవాఁడే! అధోభాగమునకుఁ బోవునప్పుడు స్పృహచెడి, సమస్తావయవములు స్వాధీనము తప్పి, మృతప్రాయుఁడై పాతాళగృహమునఁ బడును. పాతాళగృహమును బ్రవేశించుటతోడనే పై భవనమునం దెన్నిసౌకర్యము లున్నవో యన్ని సౌకర్యములు నీ పాతాళగృహమందును గలవు. గాలి, వెలుతురు వచ్చుటకు విద్యుచ్ఛక్తియంత్రములు విరివిగా నమర్పఁబడియున్నవి. ఏగది చూచినను విశాలమై మెత్తని పరుపులతో,

ఇనుపమంచములతో, దూదిపింజలబురుడించుదిండ్లతో నమర్ప బడియుండెను. ప్రతిమానవుఁడు సంవత్సరమువఱకు నిర పాయముగా జీవించుటకుఁ గల ఆహారపదార్థము లీ పాతాళగృహమం దమర్చఁబడెను. ఈ విచిత్రగృహమునకు మన దుర్గాకుమారి సర్వాధికారిణియై తన నౌకరులతో, సహచరులతో నివసించుచుండును. ఈమెభావము లనంత ములు. ఈమెపన్నుగడ లద్భుతములు. ఈమె సమకట్టిన కార్యములు భయాన్వితములు. ఈమె దృఢప్రతిజ్ఞ యేమో ఈమె దీక్షాభావ మేమో ముందుముందు మనకుఁ దెలియఁ గలదు.



# నవప్రకరణము.

—♦ వీరకేసరి బంధింపఁబడెను ♦—

మరునాఁడు సూర్యోదయము కాకమునుపే లేచి స్నానమొనర్చి తనరహస్యపుగదిలో రామసింగు కూర్చుండెను. అంత సూర్యభగవానుఁడు ప్రపంచములోని తండ్రితను బోఁగొట్టి యందరకును జీవకళ లొసంగుటకై తనసహస్రకిరణముల నలుదిక్కులకును బరపి యెల్లరను స్పృశించుచుండెను. రామసింగాగవాక్షమునఁ గూర్చుండు కాలమునకు సూర్యబింబమాతని కన్నులకుఁ గన్పట్టుచుండెను. ప్రపంచమునందలి సర్వదేవతలలోను బ్రత్యక్షరూపియై, ప్రపంచవృద్ధికి కారకుఁడై, దయామయుఁడై యొప్పు జ్యోతిస్స్వరూపమైన సూర్యభగవానుని కన్నులారఁ గనుఁగొనునప్పటికి శరీరము పులకరించి తన్మయుఁడై రామసింగు ఆనందసముద్రమున నోలలాడుచుండెను.

అంతట ఆకస్మికముగా నొకబాలుఁ డాగదిలోనికిఁ బ్రవేశించి యొకయుత్తరమును ఆయనయందు పడవైచి వెడలిపోవుచుండెను. ఈచప్పుడు విని రామసింగు వెను దిరిగి చూచి ఏమి టది యని ప్రశ్నించెను. బాలుఁడు వెనుకకు మరలివచ్చి, 'ఉత్తరము మీ కిమ్మని' రని తెల్పెను.

రామ—నాకు ఎవ్వ రిమ్మనిరి? నీ వెచ్చటినుండి వచ్చుచుంటివి ?

బాలు—అయ్యా! ఆయన యెవరో నాకుఁ దెలియదు. ఎవరో యొక దీర్ఘకాయుఁడు, మహాబలిష్ఠుఁడు, ఆజానుబాహుఁడు; ఈనాణెము నాచేతియం దిడి యీజాబు మీ కందఁజేయు మని చెప్పి వెడలిపోయెను. అందువల్ల నే నిక్కడఁ బసవేసి వెళ్ళుచున్నాను. ఇంతకన్న నెక్కువ నా కేమియుఁ దెలియదు.

రామ—'సరే! నీవు వెళ్ళుము' అని అతనిని బంపివేసి యాయుత్తరమును బిగ్గరగా నిట్లు చదువుకొనుచుండెను.

"రామసింగుమహాశయా!

మీరు నారాయణసింగుతోడిమైత్రిని వీడుఁడు. మీయుద్ధరకు నిట్టియత్యంతమైత్రి యెందులకుగలిగెనో తెలియదు. మీరు నావాక్యములఁ బాటించి నారాయణసింగును నాకొప్పగించుఁడు. మీరు సర్వకాలసర్వావస్థలయందు మీమిత్రుని యెడల జాగ్రత్తగాఁ బ్రవర్తించవలయును. మీరు రాత్రి పండ్రెండుగంటలకు నాయుద్యానవనము దాపునకు దయచేసినచో సర్వము విశదము కాఁగలదు. మీరు నామాట విని నారాయణసింగును నాకు సమర్పింపుఁడు.

ఇట్లు,
రాణీ దుర్గ."

ఈయుత్తరమును, జదువుకొని మనస్సులో నేమేమియో వితర్కించుకొనుచు ఆలోచనాసముద్రమునఁబడి యీఁదులాడుచుండెను. మధ్యమధ్య 'యీయుత్తర మేమైయుండునా? దీని యుద్దేశము నిజమై యుండునా' అనుమాట వినవచ్చు

చుండెను. అంత నొక దివ్యమంగళవిగ్రహము రహస్యముగ రామసింగు వెనుకకు చప్పుడుసేయక వచ్చి యీ లేఖ నంతయు జదివి వెనుకకు దిరిగిపోయెను. ఈసంగతి రామసింగు కనిపెట్ట లేదు. ఆయాలోచనాసాగరమునుండి దరిజేరునప్పటికిగదా! అటుల వెనుదిరిగిపోయినస్త్రీ తొందరతొందరగా భవనము లోని కేగి యొక గదిలోఁగూర్చుండి యేదియో వ్రాయుచుం డెను. ఆజాబు వ్రాయునపుడు పూర్ణచంద్రుని హసించు నామె ముఖకమలము వాడిపోవుచుండెను. కనులనుండి యుష్ణాశ్రుకణములు రాలఁజొచ్చెను. శరీరమంతయు గజగజ వణఁకుచుండెను. ఏదోవిధముగా పూర్తిచేసి "గోపీ! గోపీ!" యని పిలిచెను. గోపి యనుదాసి వెంటనే వచ్చెను. గోపిచెవిలో నేదియో రహస్యమును జెప్పి కాగితమును మడచి దాని చేతిలో నిడి 'జాగ్రత్త' యని పంపివేసెను. గోపి యెచ్చటికో త్వరితగమనమునఁ బోవుచుండెను.

ఉదయము రెండుబారల ప్రొద్దెక్కినది. బాలభానుని కిరణములు సన్ననిమబ్బులచేఁ గప్పఁబడి, ప్రకాశవిహీనము లయ్యెను. చల్లనిగాలి వీచుచున్నది. కాసారమున చిన్న చిన్న కెరటములచే జలోపరిభాగము చంచలమై యుండెను. అందుఁ బ్రతిఫలించు నాకాశము సహవాసదోషముచేతఁ జలించుచున్నట్లే కన్పట్టుచుండెను. ఆసమయమున నాతటాక మందు రామచంద్రనగర మెంతయు సుందరముగఁ గన్పడక పోదు. తటాకపుటొడ్డున మెట్లవరుసలు నిండునటుల మనుష్యు లుండి తమ తమ కార్యముల నిర్వర్తించుకొనుచుండిరి.

కొందరు వస్త్రముల నుదికికొనువారును, కొందరు జలము లను కలశములలో నింపువారును, నింకఁగొందరు స్నానాది కృత్యముల నెరవేర్చువారును నై యుండిరి. కొంటె బాలురు కొందరు ఏలలువేసికొని యీతలు కొట్టువారును నయి యుండిరి.

తటాకపుటొడ్డుననున్న వృక్షములపై శకుంతసంతా నములు కిలకిలారావములు చేయుచుండెను. కొంతమంది నవయౌవనకాంతలు రహస్యపు ముచ్చటల నాడుచు జల పాత్రముల బుజములపై నిడికొని యడుగడుగునకు కాలి మెట్టియలు చిటుకు చిటుకు మని మ్రోయ గృహవాటికల కేగుచుండిరి.

ఈ దృశ్యమును కన్నులారఁ గాంచుచుఁ దన్మయత్వము నొందుచు నారాయణసింగు వృక్షము నీడ నాసీనుఁడై యుం డెను. అచ్చటి కొక యువతి నిశ్శబ్దముగా వచ్చి వానియొడి లోని కొక లేఖను జారవిడిచి పోయెను. అంత నేదియొ సవ్వడి యైనట్లు నారాయణసింగు గ్రహించి వెనుదిరిగి చూచెను. ఎవరును గన్పడరైరి. తన యొడియం దొక లేఖయుండుటను జూచి, అది యే మని యాశ్చర్యమున విప్పిచూచెను. అది యొక ప్రణయ లేఖ. ఆ లేఖ నందుకొని తనలోఁ దా నిట్లు చదువు కొనుచుండెను.

"మహాశయా!

మీర లీ క్షణమున నిచ్చోటు వాసి యెచ్చటికైన సత్వ రము చనుఁడు. అశ్రద్ధచేయకుఁడు. ఆలస్యమైనయెడల తప్పక

ప్రాణాపాయము సంభవించును. మిమ్ములను నా పరమేశ్వ
రుఁడు రక్షించుగాత!

ఇట్లు,
శ్రేయోభిలాషి."

ఈ యుత్తరము పూర్తిగాఁజదువుకొని, దీని సారాంశ మేమైయుండునా యని యాలోచించి యాలోచించి, అటులనే కొంతసేపు కూర్చుండి తటాకమువంక నొకసారి దిలకించెను. అం దెవ్వరును కానరాలేదు.

ఇపుడు దాదాపు పండ్రెండుగంటలు కావచ్చినది. మార్తాండుఁడు గగనమధ్యభాగమున తాండవించుచుండెను. ఈ సమయమందు తటాకముకడ నెవ రుండెదరు? ఎవ్వరి యిండ్లకు వారు పోయిరి. ఈ వ్యక్తిమాత్రము మాలాగుననే కూర్చుండి యేదియో యాలోచించుచుండెను. అంత నల్వురు దీర్ఘకాయులు, మహాబలిష్ఠులు పరుగుపరుగున వచ్చి నారాయణసింగుపైఁ బడి స్ప్రుహతప్పునట్లు వానిని బంధించి యెత్తుకొని చెట్లచాటునకు గబగబ కరుగిడిపోయిరి. అక్కడ శకటమొకటి నిలిపియుంచఁబడెను. దానిలో నీపురుషునిఁ బడవేసి యశ్వములను వాయువేగమున నడచున ట్లదలించుచు పోవుచుండిరి.

ఆబండి పోయిపోయి విచిత్రభవనమునొద్ద నాపఁబడియెను. పై నల్వురు గుభాలున బండిలోనుండి దుమికి బంధింపఁబడిన పురుషుని తమ భుజములపై నిడికొని తలుపులు తీసికొని భవనములోనికిఁ బ్రవేశించి, అం దొక కారాగారమందుఁ

బ్రవేశపెట్టి వానిబంధనములను విప్పి కారాగారమునకు తాళమువేసి వెళ్ళిపోయిరి. బంధనములచే మూర్ఛాక్రాంతుఁడై యున్న నారాయణసింగు అంత కొంతవడికిఁ దెప్పిరిలి 'ఇచ్చటి కెటుల వచ్చితిని? నేనువృక్షమునీడఁగూర్చుండి యుండగా నన్ను బంధించిరి కదా! వారలేకాఁబోలు న న్నిచ్చటకు గొనివచ్చి యీగదిలో పడవేసి వెళ్ళియుండిరి. ఇది యొకభవన మని తలం చెదను. నేనును రామసింగును, వైకుంఠయోగియు కలిసి వచ్చి ఆరాత్రి మేము వినిన మాట లీ భవనమునుండియేకదా? ఆహా! ఏమి! అపరమేశ్వరుని మాయ! ఇంతకుముందు తరుచ్ఛాయల నాసీనుఁడనై, ప్రకృతిసౌందర్యమును దిలకిం చుచున్న నేను, ఇప్పు డీ భవనమందు బంధితుఁడ నైతినికదా! కాలము క్షణములో నెట్లుమారిపోయెను!' అని యేమేమో యనుకొనుచుండెను.

సాధారణముగా నాపదలయందుమాత్రము పరమే శ్వరుని స్మరియించి సంపదలయం దాతని మరచుట మానవుని స్వభావధర్మమై యున్నది. సంపదలు మానవుని కుత్సాహము కలిగింపఁగాఁ దనయసహాయతను మరచి స్వప్రాధాన్యత నే యాతఁడు మాటిమాటికి సంస్మరించుచు పరమేశ్వరుని మరచి పోవును. కష్టకాలమున నతనికిఁ దనయల్పతయు నిస్సహా యతయు, నిర్వీర్యతయు గోచరముకాఁగాఁ బ్రపంచమునఁ దా నొక మానవమాత్రుఁడ ననియు, అన్యులతో సమానుఁ డనే యనియు దృశ్యమగు విశ్వముకంటె నెన్నియో మడుంగు లధికుండైన పరమేశ్వరుఁ డున్నాఁ డనియు, ఆతనిసహాయ

మునసే యన్నియు జరుగుచుండు ననియు స్మృతికి వచ్చును. సామాన్యు లిట్లూనరించుచుండినను ధీరోదాత్తులు మాత్రి మెప్పుడును నొకేభావముతో నుందురు. సర్వమును స్వశక్తిచే తనే జరుగుచున్న దను ధీరులు స్వయంప్రభచేతనే సాధించి సుఖదుఃఖములఁ బొందుదురు. మఱికొందరు మహానుభావులు సర్వము పరమేశ్వరనిర్మితమే యని నమ్మి సంపదలయందును నాపదలయందును నాతనిని సమముగా స్మరించుచుందురు.

అట్లా గదిలో పరుండిన నారాయణసింగు దీనినుండి యెటుల వెలువడుదునా యని యాలోచించుకొనుచు నాపరమేశ్వరుని ధ్యానించుచుండెను.

---

# ౬ వ ప్రకరణము.

—◆ రామసింగు పట్టువడెను ◆—

నిశాకాంత తనవినీలకుంతలములనెల్ల విరియఁబోసి కొని భయంకరముగఁ దిరుగాడుచుండెను. ఆమె వ్యాకుల భారచిత్తయై తన భర్తయగు శీతాంశునికొఱకు మిగుల బాగు లొందుచుండెను. నింగియంతయు తన నీలవర్ణము బాసి భయంకరమగు నల్లరంగును దాల్చి భీభత్సాకారముతో నుం డెను. మినుకు మినుకు మని మెరసెడి యనంతకోటి తారకలు తమ స్వతస్సిద్ధమైన వెలుంగును బోఁగొట్టుకొని కానరాకుం డెను. అత్తరి ప్రాణనాథుండు లేనినెపంబున నిశాకాంత మలినవస్త్రధారిణియై స్వాంతంబున సంతసం బించుకేనియు లేక నటునిటు దిరుగాడుచున్నదో యన గాఢాంధకార మన్ని దిశల వ్యాపించెను. అత్తరి ప్రళయఝంఝామారుతము రంయి రంయి మని వీచుచుండెను. ఆగాలికి యెచ్చటి మేఘము లచ్చట చెదరిపోయి నక్షత్రములు దేదీప్యమానముగా వెలుఁ గఁ జొచ్చెను.

పాఠకులారా! ఇప్పుడు పాతాళగృహముదాపునకుఁ బోయి; యేమేమి సంగతులు జరుగుచున్నవో విందమురండు.

ఒకయెడ బందీకృతమైయున్న స్త్రీతో నీకిర్వివిధ ముగా దుర్గాకుమారి సంభాషించుచుండెను.

దుర్గ—ఏమే, సరళా! నీ వీరాత్రి నేఁ జెప్పిన పని కొప్పుకొనెదవా లేదా? నీ ప్రాణమానములమీఁద యాస కలదేని చెప్పుము.

సరళ—ఓసీ! రాక్షసీ! నేను నీవలెనే యాఁడుదాన నే. నామనసారకోరిన భర్తను వదలి యింకొకని నెట్లువరింతును? నా మానభంగము సేయఁదలంచినచో నా పరమేశ్వరుఁడు నిన్ను క్షమించునా?

దుర్గ—నీమెట్టవేదాంతములను గట్టిపెట్టుము. సత్య సేనునే వరించెద నన్ననీపట్టుదలను వదలి వీనిని బెండ్లియాడె దవా, లేదా?

సరళ—నా మిత్రులను వదలి నీచేతులలోఁ బడిన తరువాత నీవు న న్నేమి చేసినను చేయఁగలవు. ఏమైనను సరే! నామన స్సింకొకరిని వరింప నొల్లదు.

దుర్గ—ఎందుచేత వరింప నొల్లదు?

సరళ—ఎందుచేతనో యాపరమేశ్వరునికే యెరుక. నామనసార సత్యసేనునే వరించితిని. ఆతనిఁదప్ప యన్యుల వివాహమాడను.

దుర్గ—బలవంతముచేసిన?

సరళ—అసువులం బాసెద.

అంతట నొకసేవకుఁడు ప్రవేశించి, మహారాణిగారికి జయము! జయము!

దుర్గా—ఓరీ సేవకా ! దీనిని గొనిపోయి వానిని బెండ్లా డునంతవఱకు కారాగారమునం దుంచి జాగ్రతగా నుండుఁడు. తదుపరి విచారింతము.

"అటులనే చేసెద" మని భటుఁడామెను గొంపోయెను.

సరళ యిట కెటుల వచ్చినదో చూచితిరా? ఒకనాఁడు దుర్గాకుమారి యశ్వము నధిరోహించి వెడలి నిదురించుచున్న సరళాకుమారిని రహస్యముగఁ దనసేవకులచే బంధింపించి తీసికొనివచ్చి కారాగృహమం దుంచినది.

దుర్గాకుమారికి సరళయం దెక్కుడసూయ కలదు. ఎందుల కన - రామనారాయణసింగులకు సహకారిణి. అందు వలన దాని తీసికొని వచ్చి దనసహచరులలో నెవనికైన నిచ్చి వివాహముఁ జేసి, యామెయెడ తనకుఁగల కసిఁదీర్చు కొనవచ్చు నని బంధించి కారాగారమం దుంచినది.

సరళాకుమారిహృదయము నవనీతమువలె మృదువై నిష్కలుషమైనది. సుక్షత్రియవంశోద్భవయగు నా యువతీమణి మనసార నెవరిని వరించెనో వానినే వివాహమాడునుగాని యన్యుల నెట్లు వరించును? సుగుణఖని. బుద్ధులకుఁ బుట్టినిల్లు. తనస్నేహితుల రక్షించుటకుఁ బ్రాణములనైన త్యజించును. యుద్ధమునందు మిత్రవీరులకుఁ దోడ్పడిన దీ శూరవనితయె.

ఆహా ! భారతమాత యిట్టి సకలగుణసంపన్నలగు పుత్రికలను గని పెంచినందువలననే తరించి పావనియై యల రారుచున్నది. భారతమాతా! ఎప్పు డిట్టిపుత్రికలనే యిచ్చు టకై యా పరమేశ్వరుని నిరంతరము ప్రార్థించుచుందుము.

అటుల దుర్గాకుమారి సరళావివాహవిషయమై విచారించుచుండ రామసింగు నెత్తుకొనివచ్చుటకు వెళ్లిన భటులు వచ్చినందున నామెను దిరుగ కారాగారమునకుఁ బంపివైచినది.

అంతట దుర్గాకుమారి తన సేవకురాండ్రను బిలిచి "పడకటిగదియంతయు శుభ్రముగా నలంకరించుఁడు. భటులతో రామసింగును గుర్చీమీఁదఁ గూర్చుండఁబెట్టుఁడు" అని చెప్పి తాను జలకమాడఁబోయెను.

అంతట సేవకులు రామసింగును గూర్చుండఁబెట్టిరి. పరిచారికలు శయనాగారమున పూలసెజ్జ నమర్చి, గోడలకుఁ జిత్రవిచిత్రములగు పటములనెల్ల నలంకరించి పలురంగులు గల రత్నకంబళముల నేలపైఁబరచి యనేకగాజుదీపముల వెలిగించి యాగదియంతయు దేదీప్యమానముగాఁ బ్రకాశించునట్లు చేసిరి. పూలపాన్పుకు ముందర రెండు పడకకుర్చీ లమర్పఁబడియున్నవి. వీని ముందుండు డ్రాయరుమీఁద పలువిధములైన యత్తరు, పన్నీరు మొదలగు సుగంధద్రవ్యము లుండెను. ఆరాత్రి యాగది శచీశయనాగారమా యనునట్లు చిత్రవిచిత్రవస్తువులతో వేయిమంది సూర్యు లొక్కమా రుదయించినట్లు వెలుఁగుచుండెను. అంతలో దుర్గాకుమారి జలకమాడి గులాబి, సంపెంగ, పారిజాతము మొదలగు పూలచెండ్లు తన తుఱుమునఁ దురిమి, సువర్ణ కమలములుగల పట్టు దుకూలముల ధరించి దేవవేశ్య యగు నూర్వశివోలె నత్యంత విలాసముగ రామసింగుకడకు వచ్చెను.

సింహాసనమం దాసీనుఁడైన రామసిం గేమి చేయుచుం
డెనో చూతము. అతఁడు బహుళసుందరవస్తుసమన్వితంబై
యింద్రభవనంబో యనునట్లుండు పాతాళభవనము ను కన్ను
లారఁ గాంచుచు, నిర్మాణచాతుర్యమున కబ్బుర మందు
చుండెను.

ఉదయమున నుత్తరమును జదువుకొని యాలోచించి
యాలోచించి అచటనున్న శయ్యపైఁ బరుండి నిద్రాదేవత
బాహుసంకెలలఁ దగుల్కొనెను. అది యేమినిద్రయో గాని
భానుం డస్తాద్రిచేరువరకు నిద్రాదేవి వదలిపెట్టక బాహు
వులయందు గట్టిగా బంధించినదా యనునట్లు గాఢనిద్ర
లోనే మునిఁగి తేలెను. ఆసుషుప్తిలోనే దుర్గాకుమారి
భటులు వీని నెత్తుకొనివచ్చి భవనములో నిల్పిరి. భవనముం
బ్రవేశించినతదుపరి మేల్కని తా నీగృహమం దుండుట కచ్చె
రువందుచుండెను. ఇంద్రజాలమా యనునట్లుండెను. ఎప్పుడు
నెడబాయక యుండెడి మిత్రుఁడగు నారాయణసిం గాతనికి
జ్ఞప్తియే లేదు. అతను తన్మయుఁడై పోయెను.

ఉన్నట్లేయుండి యొందుకో వంగెను. అంతట జేబులో
నుండి యొక కాగితము జారి కాళ్లముందుపడెను. ఉలికిపడి యా
కాగితము నెత్తివిప్పిచూచెను. నిశ్చేష్టితుఁడై పోయెను. అపుఁ
డతనికి ఉదయమున తాను గదియందుఁ గూర్చుంటి ననియు
అప్పుడా లేఖవచ్చెననియు ఆలేఖ చూచుకొని తనశయ్యపైఁ
బరుంటిననియు నొక్కసారి జ్ఞప్తికివచ్చెను. అంతట నిది యొక
పాతాళగృహ మనియు ఇదివరలో నారాయణసింగుతోవచ్చి

విన్న మాట లీభవనద్వారమునుండియే యనియు, నొక్కసారి యాతని మనమున పొడగట్టెను. తనను మోసముచేసి యిచ్చుటకు గొనివచ్చినదేయని ఆశ్చర్యమును, నారాయణసింగునుగూడా బాధించినదేమోయను భయమును నొక్కసారి పీడించుచుండ నేమియోఆలోచించుచుఁ బ్రపంచమునే మఱచి పోయెను.

ఇట్లాలోచనానిమగ్నుఁడైయున్న రామసింగును ఖలక్షుణముల నతిజాగ్రత్తగ చాటుననుండి దుర్గాకుమారి పరిశీలించుచుండెను. అట్లు కొంతవడి చూచి యామె ఏమితలపోసెనో గాని చటుక్కున నటనుండి మఱలిపోవుచుఁ దనసేవకులకు రామసింగును బంధింప కనుసన్నచే నాజ్ఞనిడెను. తత్ప్రకారమాతఁడు బంధింపఁబడి కారాగారమునం దుంచఁబడెను.

---

# ౭వ ప్రకరణము.



## —♦ వీరకేసరి యదృశ్యమాయెను ♦—

నారాయణసింగు తన మనస్సులోఁ బరిపరివిధముల నాలోచింపుచుండెను. తా నీ చెరలో నున్నందుకు చాల పరితపించుచుండెను. కాని ధైర్యముమాత్రము విడువలేదు. అచ్చటినుండి పలాయన మగుటకు బహువిధముల యోచింపుచుండెను. కాని యెటుబోవుటకును మార్గము కానవచ్చుట లేదు. చేతిలో తన యుద్యమమునకు సహాయపడు నాయుధమైనను లేదు. ఆగది కితర ద్వారములెవ్వియు లేవు. కాని గాలి వచ్చుటకుమాత్రము విద్యుచ్ఛక్తి యంత్రము లుండెను. ఒక కిటికీ భూమినుండి రెండడుగుల యెత్తున నుండెను. దానిలో నుండి తొంగి చూచెను. బయట మరియొకగది యాతని నయనములకు గన్పట్టెను. ఆగదిలో దీపపు క్రీనీడయందు ఎవరో పరుండినట్లు తోఁచెను. చీకటిచేత నంతస్పష్టముగాఁ గనుపడకపోయినను నిదానించి చూచినయెడల గోచరింపక పోదు. ఆగదిలో దీప ముండియు లేనిదానివలెనే యుండెను. నక్షత్రమువలె మినుకుమినుకు మనుచుండెను. అచ్చట పరుండి యున్నది యొక స్త్రీగా గ్రహింపఁగల్గెను. ఆమె కదలక మెదలక చేతులు రెండు దగ్గరగాఁ జేర్చి నమస్కారము చేయుచు తన్మయత్వములోనుండినట్లు గ్రహించెను. ఆయువతీరత్నము మధ్య మధ్య యిట్లు పలువరించుచుండెను. 'ఈ దుర్గాకుమారికి

నారాయణసింగునం దింత వైరకారణమేమో తెలియకున్నది. ఆహా! యీమె ధైర్యము వర్ణనాతీతముగదా! నన్ను బంధించినది. చివరకేమిచేయునో ఆ భగవంతుని కెరుక. నన్ను దురుద్యోగమునం బ్రవేశపెట్టందలంచిన నాజీవములనైనం బాసెద గాని యీమెమాట విందునా! కల్ల!"

నారా—నీకుంగూడా నీశిక్షయే సంప్రాప్తమైనదా? సరళా!

సరళ—కిటికీయొద్ద హీనస్వరమునమాటాడు నీ వెవరు?

నారా—నేను నారాయణసింగును.

సర—ఆహా! నీ వెపుడు పట్టుబడితివి? నీవు నగరమున నుంటివనియు నెప్పటికైన నీవల్ల నాచెర విముక్తి యగు ననియు నెంచుచుంటిని. ఆయాస నిరాసయయ్యెనా?

నారా—నేనేమని తెల్పుదును? భానుని కిరణప్రసారములచే మేల్కొని తటాకమునొద్దం జేరి, యం దొకవృక్షచ్ఛాయ నాసీనుండనై ప్రకృతిసౌందర్యమును దిలకించుచుండ నెచ్చటినుండియో యొకలేఖ నాయొడిలో వచ్చిపడెను. ఆలేఖలో "ప్రాణాపాయము జరుగును. ఎచ్చటికైన నేగుము. ఇట్లు శ్రేయోభిలాషి," అని యుండెను. ఆలేఖ సారాంశమునుగురించి భావికార్యాలోచనకుం గడంగితిని. అంతలో నల్వురు దీర్ఘకాయులు, మహాబలిష్ఠులు, కవచధారులు నగువారు నన్ను బంధించిరి. వారి నెదుర్కొనుటకు ఆయుధోప

కరణము లేవియు నాయొద్ద లేకపోవుటచే వారికార్యము సులువుగా నెరవేరెను.

సరళ—అందుచే వీరు నిన్నీగదియందు బంధించిరా?

నారా—నీచెరకారణము కొంచెము వినిపింపఁగలవా?

సరళ—వినుఁడు. ఒకనాటిరాత్రి నేను నాశయనాగారమున మైమరచి నిద్రించుచుంటిని. నేను మేల్కాంచునప్పటికి ఈగదియందుఁ బడియుంటిని.

అని కొన్నిరహస్యపుమాటలు తెల్పి యేడువఁదొడంగెను.

నారా—సరళా! భయముఁజెందకుము. మన మేలాగునైనఁ దప్పించుకొని వెళ్ళు నుపాయ మేదేని యాలోచించుము.

సరళ—నా కేమియు దెలియదు. కాని యొక్కటి తోచుచున్నది.

నారా—అ దేమి ?

సరళ—మన ముందునది యొక సొరంగము.

నారా—అవును. ఆలాగున నే తోచుచున్నది.

సరళ—ఈగృహమునకు వెడల్పును బొడవును గల చక్కని గొట్టము లమర్పబడియున్నవి.

నారా—అట్టి వెచ్చట యున్నవి?

సరళ——నాగదిముందరభాగమున నొకటి యున్నది. నాగదికిని నీగదికిని మధ్య కిటికీ యమర్చబడియున్నది. దాని గుండా గాలియు, కొంచెము వెలుతురును నీవుండు గదిలోనికి గూడ వచ్చుట కేర్పరచి రని తోచుచున్నది.

నారా——అవును. ఆలాగుననే నిశ్చయింప వచ్చును. నీగది కెదురుగా గొట్టమున్నమాంట నిజమేనా? దృఢముగాఁ జెప్పఁగలవా?

సరళ——ఇం దబద్ధ మే మున్నది? ఆగొట్టము లోనుండి తప్పించుకొనుట కవకాశ మున్న ట్లున్నది.

నారా——సరేకాని ఆగొట్టము నీ కెంత దూరములో నున్నది?

సరళ——షుమారు నాలుగడుగు లుండవచ్చును.

నారా——అయితే నీ వా గొట్టము నందుకొని దానిలో నుండిదూరి బైటకుఁ బోఁజాలవా?

సరళ——అటుల ప్రియత్నముచేసిన చేతులకు గొట్టము తగులునుగాని దూరి బైటకుఁ బోగల్గుదునో లేదో? జారిపడి యెదనేమో యని భయమగుచున్నది

నారా——సరే, నేను వచ్చెదను లే.

సరళ—పరిచారకజనమంతయు మైమరచి నిద్రించుసమయముగావున మనము పారిపోవుట కిదియే మంచితరుణము.

సరే యని నారాయణసింగుతనకత్తికొలఁది కిటికీయూచలను లాగెను. అవిగూడ నీరియుండు దయవహించినవో

యన క్షణకాలములో విరిగిపోయినవి. తోడనే నారాయణ సింగు సరళగదిలోనికిఁ బ్రవేశించి అచ్చట నున్న మరియొక కిటికియొక్క ఊచల నూడఁబెరికి బయటివరండాలోనికివచ్చి 'ఏదైననొక లేఖను వ్రాసి యిచ్చట పడవేసి పోవుదము' అనెను. వెంటనే సరళ మినుకు మినుకు మని వెలుగుచున్న దీపము కడ కేగి యేదియో వ్రాసిన కాగితమును అచ్చటనే పడ వేసెను. అంతట నాతఁడా గొట్టమును బరిశీలింప నయ్యది పూర్వ మీతఁడు రామసింగు మోగులతో కలిసివచ్చిన సొరంగముగాఁ గన్పట్టె నుత్సాహియై యామెను తన భుజములపై నెక్కించుకొని గొట్టమునొద్ద నిలఁబడెను. నారాయణసింగు బాహుపరాక్రమము మనమెఱిఁగినదేగదా? ఆగొట్టము సరళా కుమారికి సులువుగా అందినది. భుజములపై నిలిచి తలను చేతులను గొట్టములోదూర్చి బైటకు పోయెను. తదుపరి నారాయణసింగు కిటికిలో నొకపాదమును వేరొక పాదమును గొట్టములోను బెట్టి నెమ్మదిగా ప్రయాసతో పైకెగఁబ్రాకి యెట్టకేలకు బైటపడెను.

అంత వారిద్దరు పాతాళగృహము వెలువడి పలాయనమై పోవుచుండగా నొకదీర్ఘకాయుఁడు వారిని తఱుమ మొదలు పెట్టెను. కొంతదూరము రానిచ్చి నారాయణసింగు హరిణంబుపై కురుకు సింహమువలె వానిపై లంఘించి యొక్క పిడికిటిపోటున నాదీర్ఘకాయుని దీర్ఘనిద్రఁబుచ్చె.

# ౮వ ప్రకరణము.

—•—

## —♦ పాతాళగృహమున బంధింపఁబడిరి ♦—

“సటలెత్తుకొని యొత్తు కిటిసైన మోటాస, పడిఁగోయఁబోడుతు నీపాదమాన
కలగుండుపడఁజెండు కరిసైనఁజెవిపట్టి, బలిమిమై దెత్తు నీపాదమాన
సెలసెప్పుకొని రొప్పు పులిసైనఁ బీడించి, పడవైతుఁజొచ్చి నీపాదమాన
తెరఁదూరి వెఱబారు గురుపోతు సైసైనఁ, ఒడి యెక్కి పాడుతు నీపాదమాన
“యితరదుర్బలమృగపంక్తులేమి లెక్క, కండగరువఁపుమాటలుగావుసుమ్ము”...
.........పట్టి బంధింతు దాని నీపాదమాన.

అని చదివి ‘ఆఁ! ఆఁ!ఎంతటిదానవు? ఇంతటిదానవైతివా? నీ పరిపూర్ణకటాక్షమే యింతవరకుఁ దెచ్చినది. నీ ప్రణయ గీతికలే నన్నింతటి మహాపదలో ముంచినవి. నీకుఁ జనువిచ్చి మాటాడుట నాయురిత్రాడు నేను పోసికొనుటయయినది. నీతో చెల్లాటము దుర్గాకుమారితో సింహపోరాటముగాఁ బరిణమించినది. “కాంతాకుమారీ! నీశౌర్యము వర్ణనాతీతము. నీ వంతదానవేగాని కాలమువ్యతిరేకము గామారి శత్రిమించి రాగమునఁబడినది. నీసహాయ మపేక్షింపను. నిన్ను కలవరపరచుట నాయుద్దేశ్యము గాదు. కానున్నది కాకమానదు’అని లోలోన వితర్కించుచు నారాయణసింగు తన సౌధోపరిభాగమునఁ బచారుసేయుచు మాటిమాటికి లేఖను జదువుచు అందలి భావముల కానంద మొందుచు, భావికార్యక్రమమును గూర్చి ఆలోచించుచుండెను.

ఇంతలో విక్రమసింహుఁ డరుదెంచి,

"మహాత్మా! అంతయు సిద్ధము. సెలవైనచో నిర్ణీత ప్రదేశమునకుఁ బోయెదము.

నారా—అంతయు సరేకాని సత్యసేనుఁడు అశ్వారూఢుఁడై తనసైన్యముతో వచ్చెనా?

విక్రమ—సత్యసేనుఁడు సైన్యసమేతుఁడై సిద్ధముగా నున్నాఁడు. సైనికులందరు ఆతురతఁ జూపుచుండిరి. ఈ మాటు దిగ్విజయము పొంది రాఁగలము. దేవరవారి మనోరథము సిద్ధింపఁగలదు.

నారాయణసింగు వల్లె యని తలయూఁచి సౌధములో నికిఁ బోయెను.

నాఁటిరాత్రి గాఢాంధకారము. కారుమబ్బులు గగనభాగమునందు సంచారమొనర్చుచున్నవి. కన్నులు మిరుమిట్లుగొలుపు మెరుపులు తళుక్కున మెరసి అదృశ్యమగుచుండెను. ప్రపంచమంతయు నిశ్శబ్దమై భయంకరాకృతితోఁ దాండవమాడుచుండెను. ధ్వనులకుఁ బ్రతిధ్వను లిచ్చు కీచురాల గానమమాత్రము పాంథులకుఁ గర్ణకఠోరముగా వినఁబడుచుండెను.

రాత్రి రెండుయామములు దాటినవి. సత్యసేనుని విక్రమసింహుని సైన్యములు భయంకరారణ్యము గుండా బడి పోవుచుండెను. వీరుల కవచములు మెరుపుల కాంతిలో తళుతళు కని మెరయుచుండెను. మధ్యమధ్య అశ్వికదళములు

వలయాకారముగాఁ బోవుచు నొకగుహనుండి మెల్లమెల్లగా నడచుచుండెను.

అభయంకరారణ్యమునందు దుర్గాకుమారిచే నిర్మింపఁ బడిన విచిత్రభవనసామీప్యమున పైసైన్యములన్నియు నిలిచి పోయెను. విక్రమసింహ సత్యసేనులు మాత్రము చప్పుడు గాకుండ తమసైన్యములకు కైసైగలు చేయుచు భవన ద్వారముకడ కేతెంచిరి. భవనప్రాకారములు పెట్టని పర్వత పంక్తులవలె నుండి శత్రువీరుల కభేద్యమై ఎక్కుటకు వీలు లేకుండెను. విక్రమసింహుఁడు తనయొద్ద నదివరకే సిద్ధముగా నున్న యుడుము నొకదాని తీసి దానిదువ్వి గట్టిమోకు దానిమెడకు దగిలించి గోడపై విడిచిపెట్టెను.

అంతట నాయుడుము కొండకోట లాక్రమించుటకు వచ్చిన మేటివీరునివలె గబగబ ప్రాకి గోడపై కెగఁబ్రాకి పై యంతస్తున నున్న గొప్ప మఱ్ఱివృక్షపుటూడనుబట్టి వస్తాదు వలె వెనుదిరిగి చూచెను.

విక్రమసింహుఁడు క్రిందికి వ్రేలాడుచున్న మోకును పట్టియవలీలగా గోడమీఁదకు ప్రాకి నిర్ణీతస్థలమున కేతెంచెను. విక్రమసింహుఁడు పైకి వెళ్ళుటతోడనే సత్యసేనుఁడు వాని సైన్యమంతయు వరుస వరుసలుగా గోడపైకి నెక్కిరి. వీరందరు గోడపైనుండి భవనద్వారముల కడ కొందరు, ప్రాంగణముల కడ కొందరు నిలిచి కావలాకాయుచుండిరి.

అంతయు నంధకారము. తరువులపొంతనుండి లేమా విచిగుళ్లనుండి కమలాకరములనుండి వచ్చు మలయమారు

తపుసోకుడుతప్ప వేరెద్దియు కానరాకుండెను. చిటపట మను చినుకులు రాలుచుండెను. కావలిగాయువారలు గాఢముగా నిదురించుచుండిరి. విక్రమసింహుఁడు సింహద్వారమున నున్న కావలివారిని తన కరవాలమునకు బలిహారమిచ్చి, మెల్లమెల్లన తప్పటడుగులిడుచు లోనికిం బ్రవేశించెను. వీని వెనుక నే సత్యసేనుఁడును, వాని సేవకుఁడును మాత్రి ముండిరి.

వీరుపోయినకొలఁదియు భవనము విశాలమై మెత్తని పరపులతోను, రత్నకంబళములతోను, పాలశిలలచే నిర్మింపబడిన వేదికలతోను హాలంతయుఁ గప్పఁబడియుండెను. వీరుహాలులోనికిఁ బ్రవేశించుటతోడనే హాలునందు చిన్నచిన్న మేజాబల్లలు కన్పడెను. మేజాబల్లలపై మధురరసములచే నింపిన కొన్ని పాత్రలు గన్పట్టెను. వానినిఁ జూచుటతోడనే విక్రమసింహ సత్యసేనులు తన్మయత్వము నొంది, అందలి పాత్రలరెంటిని చేత పుచ్చుకొని, వాని సౌందర్యముఁ దిలకించుచు వానిలోనిమధుర రసమును దనివార గ్రోలిరి.

తాము వచ్చినకార్య మేమొ, యెందుకొరకు వచ్చిరో జ్ఞప్తికిరాక కొంతవడికి తెలివిదెచ్చుకొని, పశ్చిమదిశనున్న గదిలోనికి అడుగుపెట్టిరి. ఆగది యంత్రముబిగింపఁబడిన చేకు బల్లకూర్పు గలదియగుటచే వీరడుగిడినతోడనే పాతాళగృహమునకుఁ గొంపోఁబడిరి. వారు తెప్పిరిలి లేచిపోయి అందొక గృహాంగణమందు నిలిచిరి.

వీరట నడుగిడినతోడనే యక్కడనుండి నేరుగా దుర్గాకుమారిగదిలోనికి అమర్పఁబడియున్న గంట గణగణ మోగ్రి

గెను. గంట మ్రోగుటతోడనే దుర్గాకుమారి లేచి, "ఆహా! శత్రు లెవ్వరో మనభవనమును జొచ్చినారు. ఆలసించిన ప్రాణాపాయము కలుగును" అని మరియొకగంట మ్రోగించెను. వెంటనే నలుబదిమంది సైనికులు శూరసింహుని యాధిపత్యముక్రింద హాజరయిరి.

దుర్గా—శూరసింహా! నీవు వెంటనే భవనసింహద్వారమునొద్దకుఁ బోయి ఎవరిసైన్య మిక్కడకు వచ్చెనో, యెందులకు వచ్చెనో కనుగొని వారిని వెంటనే పట్టి బంధించుకొని రమ్ము.

శూర—అమ్మా! సెలవు. నేనుపోయి యిప్పుడే వారిని బంధింతును.

అని శూరసింహుఁడు ప్రిహారీప్రాకారముకడకు వెళ్లి సైన్యమంతయు లోనికి దిగుటఁ జూచి వెంటనే ఉపమునకుఁ గట్టిన త్రాటిని కోసివైచెను. సైన్యమంతయు లోనఁ జిక్కువడెను.

శూరసింహుఁడు సైన్యమునంతను చెల్లాచెదరు చేసి ఒక్కొక్కరిని త్రాటితో బంధించి చెరసాలలోఁ బడవేసెను. అశ్వములన్నియుఁ బ్రత్యేకముగా నిర్మింపఁబడిన శాలలోఁ గట్టింపఁబడెను.

వీరులు పాతాళగృహమున బంధింపఁబడిరి. సైన్యము భవనప్రాంగణమందుఁ జెరసాలలోఁ బెట్టఁబడెను.



# ౯వ ప్రకరణము.

## కాళికాశక్తి

"ఎటులనైన నీప్రేమ యీ యిరువురందు
సమమగునో కాదో చెప్పుమా! చాల తడవు
వీరిఁ బోరించి తప్వేడ్క విరియఁ జిమ్మ
లేక కనుగొంచు నుంటి నే నాకసమున."

పై పద్యమును నిత్యమును స్మరించుకొనుచుంటివా? ఒక పురుషుని మనసార ప్రేమించి వానికి సహధర్మచారిణినిఁ గాఁబోవు నాపై నీ కింత మక్కువయా? ఏమి నీకండకావరము! దుర్గాకుమారి యొక్క ప్రథమసేనానాయకుఁడవును రసపుత్రకుమారుఁడవును నైన నీ విట్లు వివేకశూన్యుఁడవై, కామాయత్తచిత్తుఁడవై నీతివిడిచి మాబోఁటి యబలలఁ గోరుదువా? నీచాత్మా! కాచుకొమ్ము. నీపొగర డంచెదను.——

అని లోలోన రగులుచున్న కోపావేశము నడంచుకొనుచు తరులతాగుల్మములమధ్య నొకయువతి షికారుచేయుచుండెను. లతామంటపముపై పూలగుత్తులేరుచున్న గోపియను పరిచారికతో కాంతాకుమారి యిట్లు సంభాషించెను.

కాంతా—గోపీ! గోపీ! రామచంద్రనగరాధిపతి యగు నారాయణసింగునొద్దనుండి సమాచారము లేమైన తెలిసినవా?

గోపి—అమ్మా! నిన్న రాత్రియేకదా? విచిత్రభవనముపైకి సత్యసేనుఁడు విక్రమసింహుఁడు దండయాత్ర వెడిలిరి.

కాంతా—దుర్గాకుమారి పట్టువడెనా? రామసింగుని చెరబాధ తప్పెనా?

గోపి—ఏమో? యింతవరకు తెలియలేదు.

కాంతా—విక్రమసింహుఁడు సహితము వెళ్ళెనా? ఆహా! ఆమాయలమారి నానాథుని కెట్టి మాపు దెచ్చిపెట్టునోగదా! ఇదియంతయు దురవగాహముగా నున్నది. వైరకారణ మూహింపఁజాలము. ఈ కలహములు గోరంతలు కొండంతలుగా మారినవి. తుద కెట్లు పరిణమించునో చూతుముగాక! నా దేహమున నూపిరియున్నంతవరకు నారాయణా, సత్య, విక్రమసింహుల కేయూటంకము రానీయను. ఈపాటికి దుర్గాకుమారి పట్టువడియే యుండవచ్చును.

ఇంతలో నొక పరిచారకుఁడు చెమ్మటలుగార వాడిన మోముతో మేను వడక వడివడిగా పరుగెత్తుకొనివచ్చి కాంతాకుమారికి లేఖ నొకదాని నందించెను. ఆ లేఖయందిట్లుండెను.

"కాంతాకుమారీ!

పరిస్థితులు తారుమారైనవి. సింహములు బోనులోఁబడినవి. సత్యసేనుఁడును, విక్రమసింహుఁడును విచిత్రగృహమున బంధింపఁబడిరి. వారిసైన్యములు చెల్లాచెదరు చేయఁ

బడెను. వారిసేనలు చెరసాల కటకటాలలో కాపురముసేయు చున్నవి. వీలయినచో నీ సహాయ మవసరము.

ఇట్లు,

రా మ సిం గు."

అని చదివి, గుణ్జొజ్జెసి "ఆఁ! ఏమి దుర్గయాగడము! సత్వరమ పోయి నా శౌర్యముఁ జూపి దుర్గాకుమారిని నారా యణసింగు కారాగారామున బంధించెదను."

అని గోపీపరిచారికతో సైనిక వేషము ధరించుటకు దుస్తుల సిద్ధముగా నుంచుమని లోనికిఁ బోయెను.

భానుఁడు నభోమండలమంతట సంచార మొనరించి కాంతాకుమారి క్రోధోద్రేక మీరీతిగా పరిణమించునని సిందూరవర్ణముఁ దాల్చెను. శూరసింహుని పరాక్రమము క్రమక్రమముగా తగ్గునని భానుకిరణకాంతిప్రసారములు తగ్గి పోవుచుండెను. దుర్గాకుమారిసైనికనికాయము లేటవాలుగా దొర్లునని భానుఁ డేటవాలుగాఁ బడమటికొండలోనికి దూరు చుండెను. శత్రువీరులమధ్యనుండి కలకలము బయలుదేరు నని శకుంతసంతానముల కలకలధ్వనులు మారుమ్రోగు చుండెను. చంద్రోదయ మయ్యెను. కలువలు వికసిల్లెను. కాంతాకుమారికీర్తిచంద్రికలు దిశలెల్ల వ్యాపించు నని సుధా కరునికిరణకాంతు లెల్లెడలఁ బ్రసరించెను.

కాంతాకుమారి పురుషవేషము ధరించి ఖడ్గము మొలను వ్రేలాడఁగట్టి ధవళాశ్వ మధిష్ఠించి యాశ్వికదళ

మొదు వెంటరాగ దుర్నిరీక్ష్యకోధానలతప్తహృదయయై మహారణ్యంబునఁబడి పోవుచుండెను.

కొంతవడికి వీ రొకకాసారతీరమున విశ్రమించిరి. ఆ కొలనిగట్టుననే కొందరుభిల్లులు కాపుర ముండిరి.

వీర లడవిజాతివారు. వీరిభాష మోటుగానుండి వీరి లో వీరికే తప్ప యితరుల కెవ్వరికి నర్థముకాక యుండును. వీరివేషములు చిత్రముగ నుండును. మొలభాగమాత్రయు లేడి చర్మములతోఁ గప్పఁబడియుండును. కొందరు పులిచర్మం బులగూడ వస్త్రములుగా ధరింతురు. శిరోభాగము మయూర పింఛములతో నలంకరింతురు. వీరి యాచారములు శాక్తేయులరీతి నుండును. వారికి బలి, దుర్గ పొంగళ్లు మొదలగునవి పూజావిధానములు. భూతప్రేతపిశాచము లన నెక్కుడు నమ్మకము. వీరికి దైవభక్తి యెందు. నిర్దాక్షిణ్యులుగను క్రూరస్వభావులుగను వీరు కనఁబడినను నమ్మినవారియెడ వీరు కొంగుబంగారమై వర్తింతురు. నిత్యము అటవీమృగముల వేటాడుచుందురు. వేటాడుక్రూరమృగములమాంసమే వీరి యాహారము. ప్రతిశుక్రవారమును రాత్రులందు తమ గ్రామమునఁగల కాళికాదేవికి నరబలు లిచ్చుచుందురు. అట్లు నరబలుల నియ్యకున్న వీరిని కాళికాదేవి భ్రమింగు నని వీరి మూఢవిశ్వాసము. నిత్యము భిల్లాంగనలు వారిభాషయందుగల వింతపాటలు పాడుచు, గుమిగూడి నృత్యము చేయుచుందురు. అట్టి నృత్యమే ప్రస్తుతము కాంతాకుమారికి ఫర్లాంగు దూరములో నొకటి జరుగుచుండెను. దూరమునుండి వినఁబడు భిల్లాంగనలపాటల వినుచు,

"స్త్రీపుట్టువునందుఁగల కంఠమార్దవము, గానమాధుర్యము యే జాతియందున్నను నొక్కటియే కదా! పాటలయర్థము బోధపడకున్నను ఆనందరసము పొంగి పొరలుచున్నదిగదా!" యని కాంతాకుమారి లోలోన నాశ్చర్యపడుచు వచ్చు చుండెను.

అప్పుడు షుమారు రాత్రి 10 గంట లయియుండ వచ్చును. భిల్లపల్లియయందు పంబజోళ్లు కొమ్ములలోనుండి వచ్చు వాద్యములు చెలరేగుచుండెను. భిల్లులందరు తప్ప త్రావి తన్మయులై సంతోషపారవశ్యమున నోలలాడు చుండిరి. కాళికాలయమంతయు భిల్లులతో భిల్లాంగనలతో నిండియుండెను. డప్పుల ఢమఢమధ్వనులు గుండెల వ్రక్కలు సేయుచుండెను.

నాఁడు శుక్రవారముకాఁబోలు! పదియారేండ్లుగల యొక బాలికను కాళికాదేవిముందట నిలువబెట్టిరి. ఆ బాలిక మోము వాడియుండెను. ముంగురులు వంకరవంకరలుగ తిరిగి మోముపై వ్రేలాడుచుండెను. స్వర్ణచ్ఛాయను మించిన శరీర కాంతి పసుపురంగులో లీనమై సహజకాంతిని మరుఁగుబెట్టుటఁ జూడ యీబాలను కొలఁది నిముసములకు కాళికాశక్తికి బలియిచ్చుటకు వా రేర్పరచినట్లు గన్పట్టుచుండెను. తన ప్రాణములు క్షణములో పోవు నని తెలిసినప్పటికిని ఆ బాలిక దిగులొందక మందస్మితవదనారవిందయై వింతసోయగమున గన్పట్టుచుండెను. ఆమె ధీశక్తి నిశ్చలదృష్టి నిర్మలస్వభావము నిర్భయముతో నిఖిలేశుని లోలోనఁ బ్రార్థించుటఁ జూడ

నాబాల వీరరసపుత్రాంగనవలెఁ గన్పట్టక మానదు. ఆ బాలిక ప్రార్థించుట ముగిసెను. డప్పుల ఢమఢమధ్వను లాగి పోయెను. అంతట నిశ్శబ్దము. అందరు తదేకదృష్టితోఁ దిలకించుచుండిరి. కాళికా భీకరస్వరూపము గన నధికమగు భీతిని బుట్టించుచుండెను. గంటలు గణగణమ్రోగెను. తులసిమాల మెడలో పడెను. హారతులు పై కెత్తిరి. కాళికోక బిగించిరి. ముంగురుల నెగదువ్విరి. కుంకుమబొట్టు పెట్టిరి. తదేకదృష్టిని కాళికవైపు చూపు నిగుడించుమనిరి. ఆబాలిక చూపు నిలిచి పోయెను. నేత్రములు మూసెను. శిరము వంచెను. భిల్లుఁడు కరవాలము సవరించెను. హస్తము పైకిలేచుచుండెను. అందరు జయజయధ్వను లొనర్చుచుండిరి. కరవాలము శిరము పైకి దూక నుండెను.

ఇంతలో "ఆగు మాగు" మని ధ్వనిబయలుదేరి, వెనుక నుండి కరవాలము నెత్తిన హస్తము నరుకఁబడెను. వెంటనే భిల్లులందరు పోరాటమునకు దిగిరి. భిల్లులకు వచ్చిన వీరుని సేనలకు ద్వంద్వయుద్ధము ప్రారంభమయ్యెను. సాయుధులగు నావీరునిభటు లాభిల్లులఁ బారఁదోలిరి. వీరుఁడాబాలను భద్రముగా తనయశ్వముపై నెక్కించుకొని తనగుడారములోనికి పోయి బాలికతో నిట్లు సంభాషించెను.

వీరుఁడు—బాలా ! నీ వెవ్వతెవు, నీపే రేమి?

బాల—మేము రసపుత్రులము. నాపేరు మోహిని.

వీరు—మీరు రసపుత్రులా? ఇచ్చటి కెట్లు వచ్చితివి? భిల్లులతో నేల కలిసితివి?

బాల—అయ్యా! మాది మహాదేవపురము. మాతండ్రి శూరసింహుఁడు. తాను వేఁటాడుటకీ ప్రాంతములకు వచ్చుచు నన్నును గొనివచ్చెను. ఒకఁడొక పులిని వెంటాడెను. వానితో సైన్యమును బోయెను. నే నొక్కదాననే వెనుకఁ జిక్కితిని. అంత భిల్లునాయకుఁ డొకఁడు నన్ను వెరువవల దని తనయింట నుంచి నన్ను పెంచుచున్నాఁడు.

వీర—సరే! బాగుగానున్నది. నా వెంట రమ్ము. నీ తండ్రినిఁ జూపెదను.

బాల—ధన్యురాలను. తమచిత్తము. భిల్లనాయకుని సెలవుపుచ్చుకొని వచ్చెదను.

వీర—భిల్లనాయకుని నేను పిలిపింతును. నాగుడారములోనికిఁ బొమ్ము.

పాఠకులారా! ఈబాలికను బలినుండి తప్పించిన వీరుఁడు మన కాంతాకుమారి యని గ్రహింపుఁడు. అంతట మోహిని పరమానందముతో కాంతాకుమారి గుడారములోఁ బ్రవేశించెను.

కాంతాకుమారి తాను జేయు ప్రయత్నమున కిది యొక శుభసూచక మనియు, పన్నగడ పన్నుటకు మోహినికూడా నుపకరించుననియు నీమారు దుర్గాకుమారి కుతంత్రములు భేదించుటకుఁ దగిన సావకాశము, ప్రత్యుపాయము దొరికె ననియు నువ్విళ్ళూరుచు గుడారములోనికిఁ బోయెను.

ఈమె మాయోపాయము లెట్టివో ?

---

# ౧౦వ ప్రకరణము.

## —♦ అపరిచిత పురుషుడు ♦—

"మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైకకా-
ర్యాయత్తుల్ సమయానుకూలహృదయవ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవార, లాపయి మహీపాలు ర్మహావైభవ
శ్రీసౌగాంధులు, సెప్ప నేల మగవారికి నమ్మఁగావచ్చునే ?

వీరాధివీరులై, రసపుత్రశూరులై, కొండకోటల నాక్రమించుకొని సకలవైభవసంపన్నులై, వజ్రహృదయులైన మీవంటివారి కులంబున బుట్టుట మేమును గర్వింపవలసిన విషయమే ! స్వైరవిహారధీరలగు సారసలోచనలమైన మేము మిమ్ముఁ జయించుట దుర్లభమే. కాని వీరాబాయి, రాణీ, పద్మిని, అహల్య మొదలగు వీరవనితల స్మరించునప్పుడు మా శరీరము లుప్పొంగకమానవు. కాంతలు పరతంత్రలన్నమాట కల్ల. వీరి మనసు వెన్నవలె కరంగుట సున్న. పలుకు లమృతోపమాన మని మీరువర్ణించినను సమయమునుబట్టి కాలకేయుని ములుకులవలె నాటకమానవు. ధీరోదాత్తపురుషులగు మీరును సామాన్యులు గారు. మీభావములు నిగూఢములు. మీచర్య లద్భుతములు. మీ యూహ లనంతములు. ఎప్పుడేమాట మాటాడినను ద్వంద్వార్థ ముండకమానదు. మాలతీలత ముట్టిన మగువలు ఆసలుబెట్టి యేచుచుందు రని యా మీయూహ ? మధురపానము మకరందపానముతో

సమానమనియు, కాంతాధరామృతంబుతోఁ దులఁదూగ దని యు మూఁడుసారు లుచ్చరించుట పరాంగనలమధ్య నగు బాటా ? ముగ్ధాంగన లీ మాటల సహింతురా ? బాహ్య చేష్ట లెంత ప్రశంసనీయముగా నుండి చెక్కుచెద రని మాటలతో స్థిరమైన నడవడిగలిగి పొల్లువోవని వాక్కులతో ధీరస్వభావ మున నెట్లు సంచరింతురో, అంతకన్నను మిన్నయగు ప్రేమ రసావేశమున హృదయము పొంగి పొరలుచుండ హృదయ పేటికాంతర్గతమైన ప్రణయప్రేమాందోళితదృష్టిప్రసారము లప్పు డప్పుడు బరపుచుందురా ? మానోటినుండి వచ్చు ప్రతివాక్కు మీ కమృతోపమాన మట్లు చెవియొగ్గి ఆల కింతురా ? మే ముండుతావులు మీకు స్థిరావాసములా ? మా సౌందర్యమును దిలకింప నిత్యము యీకింత కుతూహల మేల ? క్షణక్షణము ఏదియోపనిఁ గల్పించుకొని యా నెప మున మే ముండుతావుల కేతెంచి మాతో సంభాషించు టకుఁ బ్రయత్నింతురా ? మనశ్చాంచల్య మొందునప్పుడు అదృశ్యమై లేమావిగున్నల పొంతఁ జేరి కీరశారికల కలకల ధ్వనుల వింఁదురా ? మాతో విహరింప ర మ్మని వేఁడునప్పుడు సయ్యాటలాడుటకు మాటిమాటికి మా సఖులు మిమ్ము, బ్రతిమాలినప్పుడు దయాశూన్యులై మేము సోమరిపోతు లము గా"మని జవా బిత్తురా ? దృష్టిప్రసార మొకరిపై, ప్రేమోన్మాద మొకరిపై, వాహ్యాళిసల్పునపు,డొకకాంతతో, సరసోక్తు లింకొకసఖితో, సయ్యాట లేవయ్యారితోనో, సమయానుకూలముగా సంచరించు చంచలహృదయులగు

మగవారితో తత్త్వ మెఱుంగక తన్మయులై, తాపముచేఁ గృశించుచు తన్వంగుల తత్తరపాటు, చిత్తభ్రమ వర్ణనాతీతము. స్వభావ మెఱుంగక వరించు వనితాలలామలు, స్వానుభవముననైన గ్రహించి సత్వరము వీడుట శ్రేయోదాయకము గదా! నారాయణసింగూ! నీ వెంతటివాఁడవు? నావలలోఁ జిక్కియు, సరళాకుమారితోఁ దప్పించుకొంటివా?"

అని యనుకొనుచు దుర్గాకుమారి తన భవనమం దొక సింహాసనమం దాసీనురాలై దీర్ఘాలోచనఁ జేయుచుండెను.

శూరసింహుఁడు రామసింహుని, విక్రమసింహుని, సత్యసేనుని బందీకృతులఁగాఁ జేసి దుర్గాకుమారియెదుట నిలఁబెట్టెను.

దుర్గా—రామసింగూ! నీ శౌర్యమంతయు నేఁ డెచ్చట దాగినది.

రామ—దుర్గా! మమ్ముల నేల నిందించెదవు? కాలవాహిని యెల్లప్పుడు నొకేరీతిగా ప్రవహింపదు—నీసుందర వదనారవిందము జూచునప్పుడెల్ల నా కొక వింతగా జూపట్టి జాలివొడముచుండెను.

దుర్గా—అవును. నీ మాయోపాయము లన్నియు నాకుఁ దెలియును. నీ వింతటి మిత్రద్రోహి వని యొకప్పుడును తెలిసికొనలేకపోతిని. నీ మిత్రుని నీ వెంత మోసగించితివో జ్ఞప్తియున్నదా?

రామ—నామిత్రుని-నాయనుంగుమిత్రుని—నాసహచరుని—నాబాల్యస్నేహితు—నారాయణసింగునా?

దుర్గా—అవును. నారాయణసింగునే! నీవే సర్వస్వ మని నమ్మి, నీవే తన జీవరత్నమని తలంచి, నీ కంచమున దిని, నీమంచమునఁ బరుండి, నిన్ను ప్రాణతుల్యునిఁగా భావించుచున్న సఖుని ప్రాణసంకటమునఁ బడవేసి, ఏమియుఁ దెలియనివానివలె నటించుచుంటివా ? పయోముఖవిషకుంభమా! నీచూపు లానాఁడే గ్రహించితిని. ప్రప్రథమమున నిన్ను గౌరవించితిని. నీగౌరవము నిలుపుకో లేకపోయితివి.

రామ—కుమారీ! ఏల నిందించెదవు? సాక్ష్య మున్నచో నానేరము బయలుపెట్టుము. లేకున్నచో కఠినవాక్యములు చాలింపుము. ఇది నీభవన మని త్రుళ్ళఁబోకుము.—నీగర్వ మడంచెదము; జాగ్రత! —

దుర్గా—ఛీ! దురాత్మా! నీమోము చూడఁగూడదు. శూరసింహా! వీనిని కటికచీఁకటిగదిలో బంధింపుము.

శూర—అమ్మా! సెలవు.- అని రామసింగును దోడ్కొనిపోయెను.

దుర్గా—విక్రమసింహా! నీవు నారాయణసింగునొద్ద కొలువుండి యెంతకాలమైనది ?

విక్ర—షుమారు నాలుగు మాసములై యుండవచ్చును.

దుర్గా—మీరును నారాయణసింగున కనుచరులౌటచే మాచే బంధింపఁబడితిరి. క్రిందుమీఁదులు తెలియక సహాయమొసర్చినందులకుఁ దగిన శాస్తియయినది.

సత్య—దుర్మార్గురాలా! దుర్గా! నీవు ఘోరపాపినివి. రసపుత్రకులమునందు జనించి, వంశమునకుఁ గళంకముఁ దెచ్చుచుంటివి. మాయమాట లేవో కొన్ని నమ్మి, చిత్రవిచిత్రలేఖలన్నియు నీ సంబంధములే యని దురూహాతో - శూరసింహుని యాధారముతో నిచ్చట భవననిర్మాణముఁ జేసి పాతాళగృహ మొండు నిర్మించి, ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలుచు, మాయాజాలముల పన్ని, యెవ్వరో కుతంత్రకార్యము లొనర్చుచు, పవిత్రవంశసంభూతులమైన మమ్ము నిందించుటఁజూడ "గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిన"ట్లున్నది. నీకుఁ దగినవాఁడు నారాయణసింగు - నీగర్వ మడంచును - నీకుతంత్రముల భేదించును - నీదుర్గము విధ్వంసముగావించును - నీభవనమున కగ్నిసంస్కారముఁ జేయును - నిన్నుఁ బాదాక్రాంతురాలినిఁగాఁ జేయును - తొందరపడకుము! బోటీ! నీమాటలతో నేమిప్రయోజనము? మాస్థితిగతు లీరీతి పరిణమింపఁగానే పరాక్రమశూన్యులనుగా మమ్ము భావింపఁ బోకుము!

దుర్గా—ఆఁ, ఆఁ! ఏమంటివేమంటివి? నీశౌర్యము వర్ణించుకొనుచుంటివా? నీప్రతాపమును వెల్లడించుకొనుచుంటివా? మీవారు వచ్చి యింతటికార్యమును నెరవేర్చినారు! ఇంక వారు వచ్చి నిర్వహింపఁగలరు! ముందుముందు మాటలఁ బ్రయోగింపకుము. అవస్థలపాలయ్యెదవు. చింతచచ్చినను పులుసు విరుగలేదన్నట్లు పొగరడంగినను వదరుబోతుమాటలడంగలేదుగదా! అని రూక్షేక్షణయై "ఈ యువ్వురకు

భోజనసౌకర్యము లాపుఁ"డని యాజ్ఞనిచ్చి, లోనికిఁ జనెను.

ప్రొద్దు గుంకెను. సందెచీకటు లెల్లెడల గ్రమ్మెను. తారకలు మినుకుమినుకు మనుచుండెను. పక్షులు తమతమ గూండ్లకు బారులుదీరి వచ్చుచుండెను. వృక్షములమధ్యఁ బండుటాకులమర్మరధ్వనితప్ప వేరొండుశబ్దము వినవచ్చుట లేదు.

చిత్రభవనమున కెదురుగా రెండుమైళ్లదూరములో విడిసియున్న గుడారములప్రాంతమందు చిన్నచిన్నగుట్టలు గుట్టలుగా పోయఁబడిన యిసుకతిన్నెలలో నిద్వ రిట్లు సంభాషించుకొనుచుండిరి.

పురుషుఁడు—నీ వాభవనమునకు పడమటి భాగమునఁ గల యుద్యానవనములో నుందువా?

స్త్రీ—అవును, మహాత్మా! పడమటి భాగమునందుఁ గల ఉపవనమునం దొకకొలను గలదు. ఆకొలనిగట్టున రెండు వృక్షము లున్నవి. ఆవృక్షములసామీప్యముననే ద్రాక్షపందిరియొక్కటి గానుపించును. ఆపందిరినుండి సూటిగా వచ్చినచో మాకుటీరము గనుపించును.

పు—కుటీరమునందే నివసింతువా? ఎందేని నేగెదవా?

స్త్రీ—నే నెచ్చటికినిఁ బోవను. మీరు వచ్చువరకు నే నశ్లేకనిపెట్టుకొని యుండెదను.

పు—సరే! నీ జాగ్రత్తలో నీ వుండుము. తప్పక రేపు నిశీథిఁ బండ్రెండుగంటలకు వచ్చెదను.



# ౧౧వ ప్రకరణము.

## —◆ మహాయుద్ధము ◆—

విచిత్రభవనప్రాంగణమునందున్న చిన్న కాసారపు గట్టునందుఁగల వటవిటపిచ్ఛాయలనుండి యొక స్త్రీయుఁబురుషుఁడును మెల్లమెల్లగా నడచుచుండిరి. అప్పటికి షుమారు రాత్రి పదిగంట లై యుండవచ్చును. ఆ స్త్రీ యాపురుషునిఁ దోడ్కొని భవనమందలి వెనుకభాగమం దున్న యుపవనము లోనికిఁ గొంపోయెను. ఉపవనమునందు శిలాగృహ మొకటికట్టఁబడియుండెను. ఆశిలాగృహమం దొకబిల ముండెను. ఆబిలము నుండి లోనికిఁ బోవుటకు చక్కని మెట్లు కట్టఁబడెను. ఆపురుషుఁడును స్త్రీయు బిలద్వారముగుండ మెట్లవరుసనుండి పాతాళ గృహమునకుఁ బోవుచుండిరి. వీరు కొంతదూరము పోవుటతోడనే విశాలమైన భవనము గన్పట్టుచుండెను. ఆ భవనమంతయు కొండరాలచేఁ గట్టఁబడి విశాలమైన గదులతో నిండియుండెను. గదులలో విద్యుచ్ఛక్తిదీపములు వెలుఁగుచుండెను. గాలియు విద్యుచ్ఛక్తియంత్రములనుండి వచ్చుచుండెను. ఆ గదుల తానుకొని రెండుచెరసాలలుఁగూడ గన్పట్టును. ఆ చెరసాలల లోనే యిదివరలో బంధింపఁబడి ప్రవాస మనుభవించుచున్న రామసింగు, సత్యసింగు, విక్రమసింహులు వరుసగా మూర్ఛిల్లి పడియుండిరి. మన పురుషుఁడు మెల్లమెల్లగా వారియొద్ద కరిగి చన్నీటిని వారి మొగములపైఁ జల్లి మెల్లగా వారిని లేపెను.

వారు హీనరంబులతో 'ఆపత్కాలమందు రక్షించిన గజేంద్రరక్షకుఁడవా, మమ్మింగావవచ్చితివా' యనుచు నెదురఁ గనుపట్టు నూతనపీరునిఁ దిలకించి గుర్తింపలేక వందనము చేయుటకు సయితము శక్తిచాలక తదేకదృష్టితో నాతనిఁ జూచుచుండిరి.

అంతట నూతనపురుషుఁడు వారికిఁ గొనివచ్చిన రొట్టెలు పండ్లు మొదలగు నాహారముల నిచ్చి వారిని దృప్తులఁ గావించెను.

అంతట వీరుముప్పురు నా గృహమునుండి మెల్లమెల్లగా వేరొక ద్వారమునందున్న యంత్రము నొక్కగనే గవాక్షము విడిపోయెను. గవాక్షముగుండా వీరుముప్పురు మన పరిచిత స్త్రీ యొక్క విచిత్రభవనమందుగల పైయంతస్తులోనికి వచ్చు మార్గము గుండా దర్బారు హాలులోనికి వచ్చిరి.

దర్బారుహాలునం దక్కడక్కడ వ్రేలాడుచిత్రపటములఁ దిలకించుచు గోడపైభాగమున నినుపతలుపుల గదివైపునకు తాపటముచేయఁబడిన తీగ నొకదానిని నరికివేసిరి.

ఈ తీగవలన దుర్గాకుమారి కెంత యుపయోగమో వెనుకటి ప్రకరణమునందుఁ జెప్పియుంటిమి. ఈతీగె దుర్గాకుమారిశయనమందిరమునకు తాపటము జేయఁబడెను. ఆమె యాపదవేళలం దీతీగె నొక్కును. అంతట నీతీగెవలన ముందరహాలునందు సైనికులకు వినఁబడునట్లు గంట గణగణ మ్రోగును. మ్రోగుటతోడనే సైనికులు సంసిద్ధులై దుర్గాకుమారి యాజ్ఞాపించిన పనులను నిర్వర్తించుచుందురు.

ప్రస్తుతము అతిగె నరుకఁబడుటవలన దుర్గాకుమారి సాధనోపకరణములం దత్యుత్తమమగు సాధనోపకరణము నశించెను.

వీ రిట్లు తీగెను నరికి అంతకుపూర్వమే సంసిద్ధులై కాపున్న సైనికులకడకు పురుషుఁడొక సేవకుని బంపించెను.

వారు అశ్వారూఢులై భవనము ముంగట నిలిచిరి. వారిని భవనముచుట్టును కావలా కాయుఁడని చేసన్నల నుత్త రువులొసంగెను.

అంతట విక్రమసింహసత్యసింహులు దుర్గాకుమారి శయనమందిరమునం బ్రవేశించిరి.

దుర్గాకుమారి గాఢనిద్రాపరవశయై యుండెను. వీరు ప్రవేశించి, యామె పరుండియున్న మంచము దాపునకుఁ బోవుసరికి 'ఢాం' అను శబ్దము బయలుదేరెను. వెంటనే కుమారి లేచి,

"దుర్మార్గులారా! మీరెట్లు చెఱసాలనుండి విముక్తులైతిరి? ఎవరో దుస్తంత్రములు పన్ని నన్ను మోసగించు చున్న ట్లున్నది. కాచుకొండు" అని పడకయందుఁగల తన కర వాలము నెత్తి జళిపించుచు, మహిషాసురమర్దనివోలె వదనబిం బమంతయు నెఱ్ఱవార కోపరసావేశమున గ్రుడ్లెఱ్ఱజేసి, పండ్లు పటపటఁ గొరుకుచు వారిపైకిఁ బోయెను. వారును వీర శిఖామణులే యాటచే నీమెతోఁ బోరాడుటకుఁ దమ కరవాల ములఁదీసి ద్వంద్వయుద్ధమునకుఁ గడంగిరి. హాలంతయు దద్ద

రిల్లిపోయెను. దుర్గాకుమారి శౌర్యముతో వీరుల నెదిరించి హోరాహోరిగాఁ బోరాడుచుండెను.

ఢాం అను శబ్దము పేలుటతోడనే శూరసింహుఁడు వడివడిగా లేచి దుర్గాకుమారి కేదో ఆపదవాటిల్లె నని యూహించి తనసైన్యముతో భవనప్రాంగణమునకు వచ్చెను. ప్రాంగణమంతయు యుద్ధవీరులగు సేనానాయకులతో అశ్వికదళములతో పదాతులతో నిండియుండెను. భవనమందలి యుద్యానవనమంతయు రణభూమిగా మారిపోయెను. శూరసింహుఁడు శత్రుసైన్యములను జించి చెండాడుచుండెను. వేలకొలఁది వీరులు మడియుచుండిరి. దుర్గాకుమారి, అపరదుర్గవలె ఆదిశక్తిస్వరూపముఁదాల్చి తన సేనానాయకుఁడగు శూరసింహు నాధారముచేసికొని వీరుల శిరముల తనకరవాలమునకు బలియొసంగుచుండెను.

రణభూమియంతయుఁ బ్రేతభూమిగా మారఁజొచ్చెను. ఎముకలు గుట్టలుగుట్టలుగా పడెను. రక్తపుకాల్వలు ప్రవహించుచుండెను. శిరము లాప్రవాహములోఁ దేలియాడుచుండెను. విక్రమసింహసత్యసింహరామసింహులు తమ బాహుబలమంతయుఁ జూపుచుండిరి.

దుర్గ వీరవిహారము సల్పుచుండెను. విక్రమసింహుని యెడమభుజముపై నొకదెబ్బతగిలి తీవ్రమైన గాయమయ్యెను. కుడిభుజముతో విక్రమసింహుఁడు రణభూమియంతయు దెబ్బతిన్న పులివలె శూరసింహుని సైన్యములపైఁబడి చించిచెం

డాడుచుండెను. నూతనపురుషుఁడు వీరికి సహాయమొనర్చుచు దుర్గాకుమారితో ద్వంద్వయుద్ధము సేయుచుండెను.

దుర్గాకుమారీనూతనపురుషుల యుద్ధము అతివిచిత్రముగా జరుగుచుండెను. వారిద్దరు కోపఘూర్ణితమానసులై ముష్టియుద్ధము కూడా చేయుచుండిరి. మన నూతనపురుషుఁడు దుర్గాకుమారియొక్క ముష్టిఘాతంబుల కోర్వఁజాలక మరల తనకరవాలము ఝుళిపించి కుమారిపైకి నొక్కయుదుటున లంఘించి క్రిందఁబడవైచి ఖడ్గమెత్తెను. ఆహా! దుర్గాకుమారి భావిజీవితపరిమాణము ముగియుచున్నది గదా! ఇంతలో ప్రక్కన విక్రమసింహాది మహావీరులతో యుద్ధమొనర్చుచున్న శూరసింహుఁడీ దృశ్యముం గాంచి అతిత్వరితముగా కుమారికడకు బరుగెత్తుకొని వచ్చి, నూతనపురుషుఁడెత్తిన హస్తము నఱ్ఱి ఖండించెను. అంతట దుర్గాకుమారి లేచి తన నిశితకరవాలమున నానూతన పురుషుని కుత్తుక నుత్తరించెను. నూతనపురుషుఁడు వీరస్వర్గమలంకరించెను. ఈనూతనపురుషుఁడెవఁడు?

విక్రమసింహసత్యసింహుల సేనలు వెనుకంజ వేయుచుండెను. దుర్గాకుమారి కోపాగ్నిజ్వాలలకుఁ దాళలేక సైన్యములన్నియు చెల్లాచెదరై పారిపోవ సంసిద్ధతఁ జూపుచుండెను.

ఇంతలో నెటనుండియో మహాసాగరమువలె కొండొక సేనను గూర్చుకొని అందు, బుట్టునసుధాకరుఁడో యన నొక యౌవనవీరుఁడు తురంగారూఢుఁడై దుర్గాకుమారిపైకి వచ్చు

చుండెను. పారిపోవసంసిద్ధముగానున్న సేనలన్నియు వెను దిరిగి దుర్గాకుమారిశూరసింహులపైకి మరలెను.

ఈమారు చిత్రభవనమంతయు మహారణరంగస్థలిగా మారిపోయినది. ఎచ్చటఁజూచినను వీరుల మొండెములే, ఏమూలజూచినను శూరులయొముకలగుట్టలే, ఎవ్వెపుఁదిలకించి నను రక్తప్రవాహములే, ఎతట్టు పరికించినను వీరరసపుత్రి యోధుల నిశితకరవాల కాంతులే. ఈమారు దుర్గాకుమారి ప్రాణములపై నాసవీడి వచ్చినవాఁడు నారాయణసింగని భావించి తనకోర్కె నెరవేరినదని సంతసించి ఎట్టులైనను తాను ధన్యురాలనే యని భావించి నారాయణసింహునిసేనలతో నెదుర్కొనెను.

నారాయణసింగునకీ దృశ్యమంతయు నొకవింతగా గనుపట్టె దుర్గాకుమారిశౌర్యధైర్యముల కచ్చెరువొందుచుఁ, దనలోఁ దా నిట్లు వితర్కింపఁ దొడగెను.

'ఆహా! దుర్గాకుమారీ! నీశౌర్యము వర్ణనాతీతము. నీధైర్యము నిరుపమానము. వీరరసపుత్రివంశమునకు వన్నెఁ దెచ్చితివి. భారతవీరాంగనలలోన నీపేరు సువర్ణాక్షరములతో లిఖింపఁబడుగాక! నిత్యము నీనామస్మరణమే ప్రతియింటను ప్రతిధ్వనించుగాక! నిన్ను అర్ధాంగిఁగాఁ బడయుటకు నేను బాల్యమునందే ఆకాశవీధిని సౌధముల నిర్మించితిని. అవి గగన కుసుమప్రాయములై పోయినవి. ప్రణయలేఖల ప్రభావమని యిటీవల నే కనుగొంటిని? ప్రస్తుతము జేయునది లేదు. నీవో నేనో జీవములఁ బాయవలసిన తరుణ మాసన్నమైన' దని

లోలోనఁ జింతించుచు దుర్గాకుమారితో యుద్ధమునకుఁ దలపడెను. దుర్గాకుమారి నారాయణసింగువదనము కళావిహీనమై యుండుటఁ గాంచి నారాయణసింగుతో నిట్లు సంభాషించెను.

దుర్గా—నారాయణసింహా! నీమోము వెలవెలఁబారుటకు గారణ మేమి?

నారా—దుర్గా! ఆఁడుదానవైనను ఆదిశక్తివలె రణరంగ మంతయు కేళీవిహారము సల్పుచుంటివి. నీశక్తి యద్భుతము. చిన్ననాఁటి స్నేహమైనఁ బాటింపక నీ వింతటివైరముఁ బూనుటకుఁ గారణ మేమైయుండు, నని లోలోన వితర్కించుచున్నాఁడను.

దుర్గా—ఆఁ! ఆఁ! ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినదా! ఆనాఁడు లిఖయించిన ప్రణయలేఖాప్రభావమే యింతవరకుఁ దెచ్చినది.

నారా—ఏనాఁడు లిఖించినది?

దుర్గా—వీరసింహునిచేఁ బంపఁబడినది.

నారా—వీరసింహుఁడా! ప్రణయలేఖయా! అసత్యమాడుచుంటివి. దుర్గా! కృత్రిమ మని యూహింపలేకపోయితివా?

దుర్గా—స్వహస్తలిఖితము గదా?

నారా—స్వహస్తలిఖితమా? అదిమరియు మాయగానున్నది. అటులైన వీరసింహుఁ డెవఁడు?

దుర్గా—వీరసింహుఁడు మీ కాంతాకుమారి సేవకుఁడు గదా?

నారా—అవునవును, జ్ఞప్తికివచ్చినది. మున్నొకసారి కాంతాకుమారి నాకు సహాయము చేతు ననియు నిన్ను బం

ధింతు ననియు నాకు లేఖ వ్రాసినది. తప్పక ఆమెపనియే! ఆమెబుద్ధి నాపై మరలినదేమొ. కాని నాబుద్ధి చలింపలేదు.

దుర్గా—నాపై నీ కింత ద్వేషమునకు కారణము?

నారా—నీవు నాపై గ్రుగ్గట్టుచున్నా వని వ్రాసిన ప్రణయ లేఖా ప్రభావమే?

దుర్గ—సరే? నీలేఖ యందుటతోడనే సహజ వీర కాంతనగు నాకు శరీరము తెలియక నిన్ను సాధింపవలె నను నుద్దేశముతో వ్రాసితిని. సాధించితిని. నీయనుచరుల బాధించి తిని. నిన్ను నా దుర్గమునకు రప్పించితిని.

నారా—దుర్గా! నీ సాహసము ప్రశంసనీయము. నీ భవననిర్మాణ మత్యద్భుతము. ఇప్పుడైనను శాంతించెదవా? లేదా?

దుర్గా— నీతప్పు నొప్పుకొనిచో —

నారా—నేనా? తప్పు నొప్పుకొనుటా,— అటులైన యుద్ధమునకు గడంగుము.

ఇద్దరు హోరాహోరీగాఁ బోరాడుచుండిరి. శూర సింహవిక్రమసింహులు వారిలో వారు పోరాడుచుండిరి. కొంత వడికి దుర్గాకుమారి మూర్ఛిల్లెను.

శూరసింహుని సైన్యములన్నియు చెల్లాచెదరైపోయెను. భవనము నారాయణసింగు స్వాధీనమయ్యెను. జయపతాక మెగురవేయఁబడెను. దుర్గాకుమారిని నారాయణసింగు తన యొడిలోఁ బెట్టుకొని యుపచారములు చేయుచుండెను. వీరు లందరు నిశ్చేష్టులై చూచుచుండిరి.

# ౧౨వ ప్రకరణము.

—♦ కలహకారణము ♦—

కాంతాకుమారి వీరవనిత. రామసింగు చెల్లెలు. సౌందర్యఖని. ప్రవాళములమించు పాదములు, సువర్ణకలశములమించు గుబ్బలు, చంద్రునిపరిహసించు మోము, కర్పూరశకలములవంటి చెక్కిళ్లు, బెళుకుచేపలవలె కన్నులు, గలిగి పద్మినీభామవలె నొప్పుచుండును. ఈమెకు చిన్ననాఁట నుండి దుర్గాకుమారియన్న ద్వేషము. దుర్గాకుమారి నారాయణసింగును వరించుట ఈమెకుఁ బ్రాణాంతకముగానుండెను. తానెట్లైన నారాయణసింగును దుర్గాకుమారివలనుండి తప్పించి తనను వరించునట్లుగాఁ జేయవలె నని కృత్రిమలేఖ నొకటి కల్పించి దుర్గాకుమారికి తన సేవకుఁడగు వీరసింహుని ద్వారా పంపెను. ఆ లేఖాప్రభావమే దుర్గాకుమారి క్రోధమునకు కారణము. తదుపరి దుర్గాకుమారికి శత్రుస్థానమందు నిలిచి నారాయణసింగునకు సాహాయ్యపడుచుందు నని లేఖ వ్రాసి చిత్రభవనమును చిత్రముగాఁ జొచ్చి మోహినివలన రహస్యములన్నియు గ్రహించి రామసింహ విక్రమసింహ సత్యసేనులను చెఱనుండి విముక్తులఁజేసి దుర్గాసంహారమునకై పాటుపడెను. దుర్గాకుమారితో హోరాహోరిగాఁ బోరాడి యామెను దెగటార్ప నుద్యుక్తయై కరవాలమెత్తు సమయమున కరచ్ఛేదము గావింపఁబడుటచే తనయుసురుల బాసెనే గాని, సమయమునకు శూరసింహుఁడు రానియెడల నెట్లు

పరిణమించెడిదో యెఱుఁగరాదు. ఆహా! కాంతాకుమారీ! నీవు దుర్గాదేవి కంటె నధికురాలవు. నీ చాతుర్యము, నీ వ్యూహములు, నీ భుజాబలము, నీ సాహసము, నీ శౌర్యము, నీపట్టుదల, నీమాయాచేష్టితములు, నీ తంత్రములు వర్ణనాతీతములు. నిన్నుఁ గనిన భారతమాత కడు ధన్యురాలు.

పాఠకమహాశయులారా! కాంతాకుమారి దుర్గాదేవికి నారాయణసింగు పేరుతోఁ బంపిన కృత్రిమలేఖ నీక్రింద బొందుపరచుచున్నాము.

"తరువులపొంత లేచె హిమ♦ధామ సుధాకరకీర్తిచంద్రికా
కిరణసముజ్వలావికచ ♦ కేసరధూమ పరాగవాసనల్
స్థిరతర వైభవోన్నతుల ♦ శీతల శైల సమీరసౌరభం
బురుకుచపాళి డాయ మది♦యూరటఁ జెందెనికఁ దలోదరీ.
లలనా! ఏల విహారసీమలను గో♦లా మాలికాలంకృతా
కలితాందోళిత కేళికూటముల నా♦క్రిందంబు గావించెదీ
వల నారంగ మహీంజవాటికల నా♦ర్భాటంబువీక్షింపుమా
కలకంఠంబుల చక్రవాకములవా♦జ్మాధుర్యసంరంభముఁ.
సరసురాలవు గాఁబోలు ♦ సఖయ నీవు
వీరవనితవు గాఁబోలు ♦ వెలఁది నీవు
ప్రౌఢకాంతవు గాఁబోలు ♦ పడతి నీవు
భద్రముగ నుంటి భామ! సౌ♦భాగ్యసీమ.
/ / / / / / / / / /
పరిమళము లీను వివిధపు ♦ ష్పనిచయము
గలుగు లతలఁ బుష్పంధయ ♦ గానరవము

లీలరాణించు బొలర ♦ సాలచయము
పై నిలిచి పాడుకలకంఠ ♦ గానరవము
విరహబాధను శమియింప ♦ వినగరాదొ
తరుణి కెంగేలు గీలింప ♦ దారిలేదొ
కఠినురాలవు గానేల ♦ కానరాదొ
భద్రముగ నుంటి భామ సౌ♦భాగ్యసీమ.

≀ ≀ ≀ ≀ ≀ ≀ ≀ ≀ ≀

మాలతీలత ముట్టంగ ♦ మక్కువేల
అల దిలీపసింహునిగూడి ♦ యాటలేల
పల్లవాధరులను గూడి పా ♦ టలేల
పలుకు పలుకున నీకింత ♦ యులుకదేల
పొలయులుక లేల వానితో ♦ కులుకులేల
చీటి మాటికి వానితో ♦ మాటలేల
పాతకీ నీకు దాగుడు ♦ మూతలేల
కొసరి కొసరిచ్చు ముద్దుల ♦ కోర్కెలేల
సోయగంబున గ్రిగంటి ♦ చూపులేల
పడతి ప్రియుజూడగను తొట్రు ♦ పాటదేల
పచ్చరాచట్టుగమి పట్లు ♦ పరుగులేల
సరస సంభాషణము లేల ♦ విరసమేల
అంతలో వింత కౌగిలి ♦ సుంతయేల
జాణతనమేల నీకింత ♦ సరసమేల
చెట్లచాటున గిలిగింత ♦ చేష్టలేల
బాల మాకేల యీలీల ♦ మాటలేల

యిట్టి గొడవలు మాకేల ♦ పట్టు లేల
ప్రౌఢకాంతవు గాఁబోలు ♦ పడతి నీవు
భద్రముఁగనుంటి భామ సౌ♦భాగ్యసీమ.
। । । । । । । । ।
పూలమాలిక ధరియింపఁ ♦ బోయినావ
తీయ మకరంద ఝర్ఝరిఁ ♦ దేలినావ
సాదరంబున పూదెప్ప ♦ నీదినావ
చప్పరంబుల కెగఁబ్రాకఁ ♦ జాలినావ
వావి మేనత్తకొడుకు గా ♦ వలయు నీకు
వెలది చూపింపఁ బ్రియునకు ♦ వింతసోకు
చెనటి నీతోటినాకేల ♦ చేరరాకు
తరుణి మాటలేల పరాకు ♦ దరికిరాకు
వీరవనితవు గాఁబోలు ♦ వెలది నీవు
భద్రముఁగనుంటి భామ సౌ ♦ భాగ్యసీమ
। । । । । । । । । ।
పైటజారిన నవ్వైన ♦ నాటిమాట
గాటుచెక్కిళ్ళ జూపిన ♦ నాఁటిమాట
నీటుగుబ్బల కన్గొన్న ♦ నాఁటిమాట
చీటిమాటికి మరుదిట్ల ♦ నాఁటిమాట
నీటిలో మూటగట్టిన ♦ బోఁటి నీవు
భద్రముగ నుంటిభామ సౌ ♦ భాగ్యసీమ
। । । । । । । । । ।

—నారాయణసింగు."

# కృష్ణసేన విజయము.

కర్త: శంకర రామచంద్రరావుగారు.

అత్యద్భుతమైన నవల. అపూర్వమైన కథాసంవిధానము. కృష్ణసేనుని విక్రమవిహారము, అవంతీపట్టణ అద్భుతములు, చంద్రసింహుని రాజ్యతంత్రత అద్వితీయము, సుమారు 200 పుటలు.

# ప్రతాప్, రఘునాథ్.

కర్తలు: కవిసోదరులు,

దేవరాజు సూర్యనారాయణరావుగారు,

బుద్ధిరాజు హనుమంతరావుగారు.

ఇందు ప్రతాప, రఘుసింహుల పరాక్రమము, విజయసేనుని పట్టుదల, కుమార సుందర రమాకాంతుల క్రమము, భయవిస్మయ జనకము. సుమారు 200 పుటలు.

# ప్రణయబంధము.

ప్రథమభాగము.

కర్త: తంగిరాల హనుమంతరావు.

వికటసింహుని విక్రమతంత్రము, ముల్లా యుస్మాత్తుని హాస్యచేష్టలు, అత్యద్భుతము. శృంగారరసపూరితము.

వలయువారు :—

తాడేపల్లి పట్టాభిరామారావుగారు,

సంపాదకుడు.

ప్రేమలతా గ్రంథమండలి,

చొప్పరమెట్ల, ఆకిరిపల్లిపోస్టు,

గన్నవరంతాలూకా.

అని వ్రాయవలెను.

